శా. సామం బేమియు లేదు; సాంత్వనవచస్సందర్భమున్ నాస్తి; గు
ద్రామణ్యాం బధికంబు; కాముకతయున్ గాపట్యమున్ హెచ్చు; గాఁ,
గామామాత్యుఁడ వంచుఁ బల్కు నిను లోకం బెల్ల; నిక్కం బహో!
నీ మంత్రాంగముచేత నేఁడు చెడియెన్ సింహేంద్రరాట్ చింతయున్.

అని పదరి పదరి 'గణికాంగనపొందు రాజుగారికిఁ దగ దం, చెలువమాత్రముఁ జెప్పు' విది వల దని మల్లాడినను నతఁడు లోక మెల్లఁ దన్నుఁ 'గామామాత్యుఁ' డన్నమాట పొల్లుచేయునా? ఇద్దఱకు బిగ్గర వాదము. సింగరాజు 'నా మదిఁ గల, యారాటము దీర్పఁ జాలఁ డసమర్థుఁడుగా?' యని నేర్పుమీఱఁ దీర్పు చెప్పి కామరాజును జంద్రికై సంకరశర్మతో మాటాడు మన్నాఁడు. అవివేకికిఁ గుచ్చితుల మాటయే కాని సచ్చరితుల పలుకు చెవికెక్క దని యిటఁ దెలియుచున్నది. ఇదియే యిందలి నీతితరువున నలికొన్న ద్రాక్షావలి మూఁడవ పండు!

రాజఁట! వలచినది భోగముదానినఁట! ఇమ్మని వేఁడినది సోమయాజినఁట! హాస్యమా! ఇట్టి యల్లునకు నట్టికన్నియకును మామకును ముడిపెట్టు దిట్టతనము నీకే తగు. సోమయాజికిఁ 'దనభోగముకూఁతునకును గావ్యకన్యకును సింగభూమిపుండు వరుఁడు గావలయు'నే కద యాగఫలము. అతని సమ్మతి కేమి! యాగము ముగియవలసిన దే యడ్డి. చండాలసరోవరపరిసరము. నిరుత్సాహసాహసభావత్సోమయాజిసమూహము. జామాతృవేంకనాఖ్యస్తనభగ్గనము. పేరయశాస్త్రిప్రదర్శితచౌర్యచాతుర్యము. వారాంగనాభుజంగపుంగవకేళీగృహాయమానవిశాలకాయమాననికాయము. గృధ్రకాకఘూకాదికోలాహలబధిరీకృతజనము. సింగరాజకరాగ్రసమర్పితయాగఫలదానధారాపూరము! ఇవి యాగము నిర్వర్తించిన విభవములు. యాగము పూర్తినొందె. హాస్యము కీర్తిఁ జెందె. ఇఁక నాయికానాయకుల మదనార్తియే డింపవలయును.

'సత్తికి నిత్తడి సొమ్ములు' సింగారించినట్లు చంద్రిక నలంకృతిఁ జేసి 'సింగనిఁ బంట్రంబో మెఱయు పెద్ద బూతమొ' యనఁగా నాయకుని దొడ్డనుఁ

దెచ్చిరి. ఎవరు? 'అత్తటి మురిపపు నడఁ జెలికత్తియగమి గొలువ' నన్నట్లు చెలికత్తియలా? కత్తి దూసికొనదా హాస్యము చెలికత్తెలపై? కన్నతల్లియుఁ దండ్రియునే తేవలయు నని దాని యాజ్ఞ. సంకరయాజియు ముసలిసానియుఁ గూఁతును సింగనిగుడారములోని కంకటి చెంగటికిఁ దెచ్చి నిలిపిరి. శృంగారము క్రిందఁ జెలులు 'కన్నె యిందాఁక నే మెఱుంగదు సుమయ్యా, తేఱుగడ గాఁగ మెల్లన దిగ్గుకొను' మని చెప్పి 'కన్నియ హస్తాబ్జము వరు శ్రీహస్తమునఁ జేర్చిరి' గదా. అందులకుఁ బ్రతిగా హాస్యము 'ముప్పదియా ఱేండ్లదముం, దెప్పుడు నొక్కరుని నెఱుఁగ దేలాగున నీ, విప్పుడు దిగ్గుకొనియెదో' యని తలిదండ్రులచేఁ జెప్పించి చంద్రి చేతిని సింగని చేత నుంచినది. హాస్యము గా దనకుఁడు. పెక్కుబోజుంగులను జవిచూచిన ముప్పదియా ఱేండ్లది యొక్కరునిఁ గూడ నెఱుంగని ముద్దరా లగుట హాస్యమహిమ గాక మఱేమి? ఇవి యెల్లఁ బెండ్లి యైనవెనుక నుంచమునొద్ది పనులు. ఇందో, మంచము నొద్దను వచ్చినపిదపఁ బెండ్లిసేయు పని. పడుకటిల్లె పెండ్లిచవిక. కంకటియే వివాహవేదిక. మంచమునొద్ది పెండ్లికిఁ దండ్రియే పురోహితుఁడు. తల్లి పేరంటాలు. హాస్యమా! దిగ్విజయ మయినది. ఇఁక దాఁడి మరల్పుమా! సోమయాజి మంత్రము లపస్వరప్రచురముగా నుచ్చరించుచుండఁగా సింగఁడు

శా. నారీకంఠమునన్ ఘటించెను సువర్ణప్రస్ఫురత్సూత్రమున్.

ఇది మెడను నురిత్రా డని బ్రమయకుఁడు; మంగళసూత్రము గట్టినాఁడు. హాస్యరససామ్రాజ్యమహోత్సవమునకుఁ గట్టిన మంగళతోరణ మిది!

తలఁప్రాలు కాఁగానే శర్మగారికి మంగళాశాసనమునకై హాస్యదేవతా ప్రసాదమున నావిర్భవించిన యాశుకవితాధార.—

శ్లో. త్వ స్స్వస్తిరే బహుళకాఞ్చనసిద్ధి రస్తు
వంశాభివృద్ధి రధి కాస్తు శివారహో ఽస్తు
బాలార్కకోటిరుచి రస్తు మతేతరాస్య
స్తే సింగపుణ్యజనవస్య హరిప్రసాదాత్. —'న తథాస్తు' అంపము.

అంతఁ బెద్దసాని 'బాలసుమీ గోలసుమీ బేలసుమీ' యని నాఁగసును మరల నాయకున కప్పగించినది. నాయకు పరోక్షమున నాయికకుఁ జెలికత్తియలు 'ప్రియముతో ర మ్మని పిలిచినఁ జేరఁబోయెదు గాని యూరకుండెదవు సుమ్ము, విడెము చేతి కొసంగ వినయంబుతోడ నందుకొనుగా సోరకుం డెదవు సుమ్ము' అని చెప్పఁగా, నాయకుని సమక్షముననే యత్తగా రిటు 'పాట పాడు మటన్నఁ బాడక యెలుఁగెత్తి పదరి రోదనము చేసెదవు సుమ్ము' 'తములమం దిమ్మన్నఁ దమి నీక క్రమ్మఱ నాకె మ్మటంచుఁ బెనఁగెదు సుమ్ము' అని బుద్ధిచెప్పినది. ఏలనఁగా 'తురకదుండి గాఁడు దూదేకులయాఁ గాఁడు పసులవాఁడు గాఁడు బంటు గాఁ' డఁట నాయకుఁడు!!!

హాస్యవిజయలక్ష్మీకేళికాగృహ మయిన యా గుడారమునందు ముసలి సానియు సోమయాజియు నుండఁగనే సింగఁడు చంద్రిహస్తము పట్టెను. అది గుడారము కంబము పట్టికొని 'సిగ్గుంగల బాలికవోలెఁ' బెనఁగులాడును నా లజ్జకు 'సిగ్గుకు సిగ్గు లే దిటులు చేసిన పిమ్మట నుండవచ్చునే?' యని వరుఁడు చదురాడి బుజ్జగించెనా? హాస్యముక్రింద నిజమయిన లజ్జాయుఁ జల నూపునా? కాన జుట్టు పట్టికొని మొట్టి 'సిగ్గువడ నష్టానె యొండలి బిడ్డి తీర్చితో? దొంగతనంపు టీ వగలఁ ద్రోవు' మన్నాఁడు. అంత నాయికా నాయకులలాస్యము. వారిం జూచి సోమయాజియు సానియు లాస్యము సలిపిరి. ఇదియ హాస్యవిజయలక్ష్మీలాస్యము. వరూథిని 'ప్రథమసురతంబు గంధర్వ పతిఁ గరంచె'. చంద్రరేఖ 'ప్రథమలాస్యంబు సింగభూపతిఁ గరంచె'. వృద్ధ నాయికానాయకుల ప్రతిలాస్యంబుతో హాస్యరసముద్రాక యుద్దంపమై ప్రకాశించె. చంద్రి నాట్యమునకు సింగఁడు మెచ్చి 'నీ వేయెడకుఁ బోక యుండుదుము, నీ యండనె యుండువాఁడ' నని యామత్తకాశినిని వేఁడఁగా, నా యుత్తమ సతి 'ఎవ్వరిని జేరనరుగక యుండు' నని వరునికి నభయ మిచ్చెను. హాస్యరస సృష్టిలోని పాతివ్రత్యవిభవ మిది!

గుడారము బయట ద్వారముకడ నిలుచుకొని పొంచి వినుచుండిన

ఎవరు? చెలికత్తెయా? హాస్యసీమలోని కది రాదు. అత్త కొంకిరిసానియా? అది కాదు. మఱెవరు? సంకరశర్మ సోమయాజులుమామగారు. వహ్వా! హాస్య రసమా! ఇంతకు ముందు సంకరశర్మను గొంకిరికిఁ గింకరునిఁగాఁ జేసిన దటుం డనీ. ఇపుడు సోమయాజియై యటుండుటను జూడక యతని నీడ్చి వరునితో వధువును గూర్చు చెలికత్తెను జేసితివి! సానిని విటునితోఁ దార్చు కుంటెన కానిం జేసితివి! కంకటిమొద్దఁ బెండ్లి జరుపు పురోహితునిఁ జేసితివి. ఇంత టితో నయిన నింటికి వెడలనంపి సోమయాజితనము నొకముక్క నిలుపరాదా? ద్వారము కడనే పొంచుండి విను పచ్చిక్రించును జేయుదువా? నీజైత్రయాత్ర ముగిసి విడిసిన డేరావిడిపట్టుకడ జయస్తంభముగా నిలఁబెట్టితివేమో! విజయీభవ!

అంత సింగరాజు చంద్రరేఖయే లోకముగా మెలంగుచుండె నఁట. నాఁటి బద్ధానురాగంపు ముద్దుసుద్దులు. —

సీ. అది భోజనముచేసి వదలినకూడు దాఁ గుడిచి కంచముతోమి కడిగి తుడుచు;
అది తమలము సేయ నాకుచుట్టి యొసంగి తమ్మగైకొని నోర గ్రమ్మ నమలు;
అది మదిర గొనంగ నది మంచిదే యని తచ్ఛేషపాల మోదమునఁ ద్రావు;
అది నిదురించుచోఁ బదములదరిఁ జేరి వద్దువద్దనుకొద్ది గ్రుద్ది పిసుకు;
కాలు చాఁచుక కూర్చుండి పేలు గ్రుక్కు;
పేఁపుపైఁ జెమటకాయలు వెతకి గోఁకు;
వలసి మంచంబుఁ జేరి నల్లులను జంపు;
వలపు గులుకంగ సింహేంద్రమలహరుండు.

హాస్యమా! దిగ్విజయముచేసి జయస్తంభములు నాటి సామ్రాజ్యపట్టాభి షేకము సేసికొనుచున్న నీ కిది రత్నసింహాసన మారోహింపుమా!

సింగనికి దేవత్వ మొక్కటి తక్కువయైనందునఁ గుబ్జనుమించిన సొగసు కత్తె నొకతెని జేపట్టియు మఱివేవురకొలఁది నాయికల నేలియుఁ గృష్ణునంతటి వాఁడు గాఁడయ్యె. ఆ లోపమే లేకున్నచో వ్యాసుని కృష్ణునకు మిన్నగా మన హాస్యపుఁ గృష్ణుఁడు వాసిగాంచఁడా!

ఒక విశేషము. వీరభద్రతంబళికి నరసింగార్యనంబి చెప్పిన నట్టి యీ చరిత్ర. భోగముకథలా నంబితంబళుల పారాయణములు! పసుపుకుస్త్రీలా వారిపురాణకాలక్షేపములు! హాస్యమా! జయభేరీభాంకారమును వెలంగింపుమా!

హాస్యరసము చూపు వికటవైపరీత్యము మొదలింటనుండి తుదవఱకు నిందుఁ జూపట్టుచున్నది. ఆదిదేవతాస్తుతు లేమి! నడిమికథ యేమి! ఆశ్వాసాంతగద్యపద్యము లేమి! అన్నియు వికటప్రకటములే. అయినను గవి యొకటి మఱచినాఁడు. ఒక దేవత కలలో వచ్చి గ్రంథరచనమును బురికొలుపుట యిందు లేదు. కాని యీ గ్రంథమునకు సంపాదకు లిది సమకూర్చిరి. దేవతకుఁ బ్రతిగా వికటవ్రతభంగము సేయక దయ్యమును గలలోనికి రప్పించినారు. దేవత కవిని రచింపు మనకపోయినను దయ్యము సంపాదకులను ముద్రింపు మనుట చాలును. సంపాదకు లీగ్రంథమునం గల బూతుపట్టుల నెల్లఁ బాగుగా సవరించి పాఠయోగ్యముగా లోకుల కొసంగుటయందుఁ జూపిన ప్రతిభయుఁ జాతుర్యమును గవితాపటిమయు నెంతయుఁ బ్రశంసనీయము లనుటకు సహృదయులే ప్రమాణము.

శ్రీరస్తు

# చంద్రరేఖావిలాపము

## ఉపోద్ఘాతము

ఉ. ఏని మహత్త్వమున్ దెలుపు నింద్రియగోచర మౌన దంతయున్?
ఏని స్వభావపుం దెలివి యింద్రియశక్తి కతీత మై తగున్?
ఏనిని గూర్చి పాటుపడు నిష్ఠుహిఁ గల్గు మతంబు లెల్ల? నా
మానితమూర్తి నిత్యసుఖమార్గముఁ జూపుత జీవకోటికిన్! 1

వ. అని ప్రార్థించి శయ్యాతలంబు చేరి, 2

సీ. "అరయఁ జర్వితచర్వణాత్మకశృంగారకావ్యంబు లెన్నేని గలవు గాని,
యాంధ్రవాఙ్మయమున నన్యరసప్రధానప్రబంధములు గానంగ రావు;
కరుణరసైకబంధురకృతు లొకకొన్ని కలిగినంతనె తీఱఁగలదె కొఱఁత?
పూర్వకవీంద్రు లపూర్వమోద మెలర్ప హాస్యరసముఁ గూర్పరైరి యదేల?
భాష కియ్యది పెద్ద లోపంబ కాదె?"
యని తలఁచి యొక్కరాత్రి నేఁ గను మొగుడ్ప,
ఛాయయుంబోలె నొకఁడు సాక్షాత్కరించి
యిట్టు లనియెను సౌహార్ద్ర ముట్టిపడఁగ.— 3

చ. "తెలియుము నన్ను జగ్గకవిశేఖరునిఁగా నల కూచిమంచిస
త్కులకలశాబ్ధిచంద్రునిఁగఁ గోవిదమిత్ర! భవన్మనోగతుల్
తెలిసి యపూర్వమోదమునఁ దేలి బుధాదరణీయ మైన నీ
తలఁపు ఫలింపఁజేయుటకు ధారుణి కీగతి నేఁగుదెంచితిన్. 4

తే. చంద్రరేఖావిలాపహాస్యప్రబంధ
రాజము రచించియుంటిఁ బూర్వంబు నేను;
కాలవశమునఁ బై కది గర్హ్యమైన,
దానిఁ జదివి మెచ్చనివారు ధరణి లేరు. 5

క. బ్రౌనుదొర దాని కొక వ్యా
ఖ్యానము వ్రాయించెఁ బీఠికను వ్రాసెఁ; గడున్
బూని లిఖించిన ప్రతు లె
న్నైనను గల వాంధ్రదేశమందు వెతకినన్. 6

తే. కథలు కారణము లటుంచి కాంచునెడల,
నాఁటి జనతాస్థితికి దర్పణంబు సుమ్ము;
నింద్యవాఙ్మయ మనియెడి నెపమె గాని,
యాంధ్రమున నట్టి వికటకావ్యంబు లేదు. 7

తే. నింద్యవాఙ్మయ మయ్యును నిలిచియున్కి,
నెంత గుణ మున్నదియొ దాన నెఱుఁగవచ్చు;
ఇపుడు సభ్యంబుగాఁ బ్రకటింపఁబడిన,
నెత్తిపైఁ బెట్టుకొనకుండ్రె నిఖిలజనులు? 8

క. అప్పటి కా గతి సరిపడె,
నిప్పు డది యసభ్యమయ్యె; నెల్లరకును దా
నెప్పటికి రుచించు పగిది
గుప్పున సవరించి మెప్పుగొనుము కడంకన్. 9

ఉ. ఇట్టు లతండు వేఁడిన సమిద్ధహితార్థము యోగ్య మైన, నే
నట్టి పనిన్ వహింపఁదగినంతటివాఁడను గాను; గా నసన్
గొట్టునొ తిట్టునో యనుచుఁ గొంకితి విన్కనిబట్టి; యంత నా
గుట్టు నెఱింగి నవ్వుకొని కూర్మి ఘతం డిటు వల్కెఁ గ్రన్ననన్.— 10

ఆ. "ఇపుడు నేను వేఁడ నిటు జంకెదవె కాని,
దొరతనంబువారి తూర్పు ప్రాఁత
పాత్తముల కొటారమునఁ బని చేసెడి
తఱిని దీని నీవ తలఁపలేదె? 11

ఉ. మంచిదిగాఁ దలంచిన సమంచితకార్యము లెల్ల శక్తికిన్
వంచన లేక సేయఁదగుఁ బ్రాజ్ఞుఁడు విఘ్నభయంబు దక్కి; యూ
హించిరె యెవ్వరేని, పరికించి రహించిరె గాని, మార్పు గా
వించిన మే లటంచుఁ? గృతి పేద సుమీ కృతి సంస్కరింపఁగన్. 12

ఆ. లోకు లెంచి చూడఁ గాకు, లందును సమ
కాలికుల మతంబు మేలు గాదు;
సంగతములు గాని సంబంధములఁబట్టి
కాని, వారు గుణము గాంచలేరు. 13

మ. వెలయింపందగు దుర్ఘటార్థమె; దృఢాభిప్రాయముల్ లేమిచేఁ
దలయున్ దోఁకయు లేక వాగొనెడి ధూర్తశ్రేణి మెప్పింపఁగాఁ
దలమే ధాతకు వాని తాతకు? వృథా తర్కింప నిం కేటికిన్?
చెలువారన్ విబుధాభివాదము మదాశీర్వాదమున్ గాంచుమా." 14

మ. అని నన్నున్ బురికొల్ప, నుత్సుకుఁడనై యత్యంతమున్, బ్రాజ్ఞధ
ర్మనిరూఢిన్ మది నమ్మి దీనిఁ బ్రకటింపం బూనితిన్, మేదినీ
జను లామోదము పొంద, నూతనవిభూషన్ గాంచి వాగీశ్వరీ
జనయిత్రీమణి గర్వ మొందఁ, గవి కాంక్షాసిద్ధి మి న్నందఁగన్. 15

సీ. అంత, సంతర్పితస్వాం తైనట్టి యీ యతం డర్థిలిఁ గ్రమ్మఱ నరుగుదెంచి,
"మన సిచ్చి నీ కొక మాట చెప్పెద విను, మావేశమున వ్రాసినట్టి దగుట
నం దొక్కకెడ విరుద్ధార్థంబులును గల, వాలోపమును దీర్పు మవధరించి;
అది యొక పెద్దకా, దంతట నున్నబూతులను దిద్దుటయు సద్భుతము కాదు;
కట్టుకడపటి ఘట్టంబు కల దసభ్య
మం టసభ్య మ్మై; నాకె దానిం దలంప
నేమియును దోఁచకున్న; దీ వేమి సేయు?"
దనిన, "నది మాత్ర మద్దునే?" యంటి నేను. 16

చ. అనవుడు నాతఁ డత్యధికహర్షమునన్ దల యూఁచి యూఁచి "నే
ననినటు లీవె సుమ్ము కృతి నారయ మత్కృతి సంస్కరింపఁగా"
నని కొనియాడి కన్మొఱఁగె; నంతట మేల్కని "స్వప్నమే యిది?" యం
చును బహుళీకృతాస్థఁ బరిశోధన చేసితిఁ గ్రమ్మఱన్ గృతిన్. 17

తే. అది మదీయకృషికి మూల మై చెలంగ,
జగ్గకవిశేముషీవిశేషమున నాదు
లేఖినీకౌశలమును గీలించినాఁడ,
నిది యొక నవీనకావ్య మై యొసఁగునట్లు. 18

సీ. అంపలిపాత్రంబు లందలిసంబంధ మందలిబూతులు నిందు లేవు;
అందలి యద్వితీయం బగు వికటకవిత్వంబు మాత్రము నిలుచు నిందు;
కవితాభివృద్ధివిఘ్నకరంబు లైన ప్రబంధలక్షణములఁ బరిహసించి
లలి దోఁప, వివిధావలక్షణంబులు నిందుఁ జిత్రింపఁబడియె విచిత్రముగను;
లేశ మేనియుఁ జరితంబు లేదు సుంత,
కథ వినోదమాత్రార్థసంకల్పితంబు;
హాస్యముగ నీతిబోధక మై యొసంగ
నీచపాత్రంబు లిందు వర్ణింపఁబడియె. 19

మ. బహువిఘ్నంబులు సంఘటిల్లిన, మదిన్ భాషాభిమానంబు ను
స్సహరీతిన్ బురికొల్పెఁ గావునఁ, బ్రతిజ్ఞాపూర్తి యయ్యెన్; గుణ
గ్రహణాసక్తులు గాంచి నవ్వినను, నా కార్యంబు సార్థంబె యగున్;
మహితాత్ముల్ పరమార్థబుద్ధి వెలయింపం బ్రార్థితుల్ నిత్యమున్. 20

తే. ఇట్టి పరకృతిసంస్కృతి కిదియె మొదలు;
ఎంచి చూచిన, సర్వజ్ఞుఁ డెందు లేఁడు;
లోపములు గల్గెనేనియుఁ జూపఁదగును,
దిద్దుకొనియెద మరల ముద్రించునపుడు. 21

కాళ్లకూరి గోపాలరావు

శ్రీరస్తు

# చంద్రరేఖావిలాపము

## ప్రథమాశ్వాసము

శా. శ్రీకంఠుండు భుజంగభూషణుఁడు భస్మీభూతపంచాస్త్రుఁ డ
స్తోకాటోపబలప్రతాపపురరక్షోదక్షసంశిక్షణుం
డాకాశోజ్జ్వలకేశపాశుఁడు త్రిశూలాంకుండు రుద్రుండు తా
నేఁకం జీమలకొండ సింగనృపతిన్ వీక్షించు నేత్రత్రయిన్. 1

ఉ. అక్షయబాహుగర్వమహిషాసురదుర్ముఖచక్షురోల్లస
ద్రాక్షసదక్షుల న్సమరరంగములోనఁ ద్రిశూలధారచే
శిక్ష యొనర్చి శోణిత మశేషముఁ గ్రోలిన దుర్గ దుర్గుణా
ధ్యక్షుని సింగభూవిభునిఁ బద్దెయు నిర్ధనుఁ జేయుఁగావుతన్. 2

సీ. స్తబ్ధశబ్దగ్రహావ్యగ్రుఁడు సంవేష్టితోత్తాలవాలుండు కరాళవజ్ర
కర్కశదంష్ట్రాక్రకచభయంకరమహావిస్తృతవక్త్రుండు విపులదీర్ఘ
పటుతరకహకహస్ఫుటచటులకటాట్టహాసనిర్దళితవేదండభాండుఁ
డాలోకకాలానలాభీలవిస్ఫురన్నేత్రుండు ఖడ్గసన్నిభనిశాత
నఖరుఁడు హిరణ్యకశిపువినాశకుండు
సింహనగవర్తి యగు నరసింహమూర్తి
యదరఁ జీమలకొండ సింగనృపాలు
సిరియు గర్వం బడంగంగఁ జేయుఁగాత. 3

ఉ. నీరదనీలవర్ణుఁడు శునీవరవాహుఁడు విద్యుదాభవి
స్ఫారజటాభరుండు బహుసాంద్రతనూరుహశోభితాంగుఁ డం
భోరుహగర్భమస్తకవిభూషితహస్తసరోజుఁ డా మహా
భైరవుఁ డిచ్చుఁగాత నశుభంబులు సింగనృపాలమౌళికిన్. 4

చ. నలు వగు రక్తమాల్యవసనంబులు పెంపుగఁ దాల్చి కన్నులన్
జలజల బాష్పబిందువులు జాలుకొనంగఁ జెలంగుచుండు న
క్కలుములచేడెయక్క కలకాలము సింగనృపాలునింటిలోఁ
గలిపురుషానుషంగ యయి గాఢగతి న్నటియించుఁగావుతన్. 5

చ. అనుపమవిక్రమక్రమసహస్రభుజార్గళభాసమానసా
ధనజితసిద్ధసాధ్యసురదానవదక్షుఁడు దక్షశిక్షకుం
డనఁ దగు వీరభద్రుఁడు గడంకను జీవులకొంప సింగభూ
జనపతిపుంగవు న్విభవసారవిహీనునిఁ జేయుఁగావుతన్. 6

చ. అనుదినవక్రమార్గగతు లై చరియించుచు వైరివర్గముల్
దనరఁ బరస్పరాత్మతను దాలిచి మంగళుఁడు న్గురుండునున్
శనియును రాహువు న్నిగుల సమ్మతి ద్వాదశజన్మగానులన్
గొనకొని నిల్చి సింగనృపకుంజరుని న్గడతేర్తు రంతయున్. 7

క. భీమకవి రామలింగని
ప్రీమన్మథుఁ డై చెలంగు శ్రీనాథకవిన్
రామకవిముఖ్యులను బ్రో
ద్దామగతిం జిత్తవీథిఁ దలఁచి కడంకన్. 8

వ. ఇట్లు సకలదేవతాప్రార్థనంబును సుకవిజనస్తోత్రంబును గావించి
యే నొక్క హాస్యరసప్రబంధంబు సుకవినికరమనోనురాగసంధాయకం
బుగా రచియింప నుద్యోగించియున్న సమయంబున. 9

సీ. తన యపకీర్తిమూర్త్యుత్కృష్ణకాకికి గురుతరాజాండంబు గూఁడు గాఁగ,
తన లోభగుణవినూతనదురాలభలత కష్టదిశల్ ప్రాఁకు లై చెలంగ,
తన పందతన మను ఘనతమోవితతికి బహుగృహంబులు నెలవులు గాఁగ,
తనదు జారత్వచోరునకు సంకరశర్మనాటకం బర్థాంజనంబు గాఁగ,

అవని దీపించుఁ జంద్ర రేఖాభిధాన
వారనారీశరీరసంవర్ధమాన
రసపరిప్లుతబహుగదద్రణకిణాంక
భూషణుం డైన సింగనభూమిపుండు. 10

వ. వెండియు నఖండభూమండలమండనాయమానమానవాధినాథసాధుయూథ నిర్మిరోగానరోధసభాభవనాభ్యంతర నితాంతవర్ణనీయకాలకూటకాకకజ్జల ఖంజరీటకంబళీంగాలకాలమార్జాలగండోపలఘనాఘనగంధేభబంభరకదంబ సంభాసమానానూనానంతదిగంతాక్రాంతాపయశోమండలుండును, మైరా వణరావణకుంభకర్ణసుంభనిసుంభశుంభనిశుంభజంభహిడింబప్రలంబబకవత్సక బాణచాణూరఘటోత్కచకాలనేమి ఖరదూషణత్రిశిరమారీచమాలిసుమాలి మకరాక్షధూమ్రాక్షప్రముఖరక్షోదక్షసదృక్షక్షుద్రనిర్నిద్రద్రాఘిష్ఠదుర్గమ దుర్గుణాగ్యక్షుండును, సత్త్వావలక్షణుండును, బ్రాహ్మణద్రవ్యభక్షణుం డును, బాలరండాసమాకర్షణవిచక్షణుండును, నిరంతరానంతదుర్దాంత స్రోంతకాంతారాంతరాళకరాళమార్గాసర్గళసంచరద్గవయగోమాయు గోపు చ్ఛసరంగశశకమార్జాలప్రకటమృగయావిహారవిశారదుండును, మహో న్మాదుండును, సుకవినికురుంబవిద్వత్కదంబవందిసందోహవైణికశ్రేణికా మనోరథార్థవ్యర్థీకరణసంపూర్ణనిర్దయస్వాంతుండును, విగతశాంతుండును, బహువారనారీజనవ్యాలోలగుణాగణగరిష్ఠుండును, దుర్జనశ్రేష్ఠుండును, శ్రీమ చ్ఛ్రీఘులకొండవంశపారావారఘోరజాజ్వల్యమానానూనశిఖాసందోహసం దీప్తబడబానలుండును, చలచిత్తుండును, సంగరాంగణభీరుండును, విషయ శూరుండును, నీచపాచకాగారుండును, పరమదుర్బలదుర్భరశరీరుండును, ఆత్మీయదాసవిలాసినీజనమనోధనసాశ్యతోహరుండును, పతియాభుండును నగు సింగన్నపాలపుంగవుం డొక్కనాఁడు. 11

సీ. వేఁటవేఁపులుపదివేలు మచ్చికమీఱ మూతినాకుచు దండ మొఱలుఁగుచుండ,
బోమ్మతప్పెటలూని క్రమ్మి రసాలాలు జోహారనుచు వేఁటసొంపు దెలుప,

తురకనేస్తులు సురాపరిమళింబెసఁగంగఁ జెవిచెంత మనసులు చెప్పచుండ,
రసపాక్కు లడర వారస్త్రీలు ముంగలఁ దాక్షై యటంచు నృత్యంబుసలుప,
వినయ మెసఁగంగఁ గుంటెనపనులు సేయు
సేవకులు దాసికలు డాసి క్రేవ నిలువ,
అలరు చీఁదఱ గ్రామసింహాసనమునఁ
గడఁక దళుకొత్తఁ జేరోలగమున నుండి. 12

మ. సరసాగ్రేసరుఁ గూచిమంచికులభాస్వద్వార్ధిరాకావిధున్
జిరకీర్తిన్ బహుళాంధ్రలక్షణవిదున్ శ్రీమజ్జగన్నాథసు
స్థిరకారుణ్యకటాక్షలబ్ధకవితాధీయుక్తునిన్ జగ్గరా
డ్వరనామాంకితు నన్నుఁ జూచి పలికెన్ వాల్లభ్యలీలాగతిన్. 13

సీ. రచియించితివి మున్ను రసికు లౌనని మెచ్చ సురుచిరజానకీపరిణయంబు;
వచియించితివి కవివ్రాతము ల్పొగడంగ ద్విపదరాధాకృష్ణదివ్యచరిత;
ముచ్చరించితివి విద్వచ్చయంబునుతింపఁ జాటుప్రబంధముల్ శతకములును;
వడి ఘటించితి విరువదిరెండు వర్ణనల్ రాణింపఁగా సుభద్రావివాహ;
మాంధ్రలక్షణలక్ష్యంబు లరసినావు;
భూరిరాజన్యసంసత్ప్రపూజితుఁడవు;
భళిర! నీ భాగ్యమహిమ చెప్పంగఁదరమె?
జగ్గకవిరాజచంద్ర! వాచాఫణీంద్ర! 14

మాలికోత్పలమాల

అర్ణవమేఖలం గల మహాకవికోటులలోన నెంతయున్
బూర్ణుఁడ వీవు సత్కవిత; బూతులరీతుల గోరు కొండగా
వర్ణనసేయ నేరుతువు; వాలెముఁ జుల్కఁగఁ బల్కుమూర్ఖులన్
దూర్ణమె తిట్టి చంపుదువు; ధూర్తవు, పౌరుషశాలి వెంతయున్;
నిర్ణయ మిత్తెఱంగెటేఁగి నేర్పున నిన్ను బహూకరించినన్,
స్వర్ణవిభూషణాంబరగజధ్వజచామరగోధనాశ్వదు

స్వర్ణవిచిత్రపాత్రబహురాజ్యరమారమణీయపుత్రసం
కీర్ణసమస్తవస్తువరగేహసమంచితభోగభాగ్యమున్,
కర్ణసమానదానము, నఖండపరాక్రమశక్తి, నిత్యదు
ష్కర్ణనిలీనవాగ్విభవగౌరవ, మాశ్రితబంధురత్వమో
దీర్ఘకృపారసంబును, నతిస్థిరబుద్ధి, చిరాయువున్, సుధా
వర్ణయశంబును న్గలిగి వర్ధిలఁజేతువు జగ్గసత్కవీ! 15

వ. అని యనేకప్రకారంబులం గొనియాడి యీడులేని వేడుకం జంద్రరేఖాభి
ధానవారవారణరాజయాన యూరుప్రదేశంబున శిరంబు మోపి పరుండి
క్రిందు చూచుచు నారాజాత్మజుం డిట్లనియె.— 16

సీ. విర్రవీఁగి ధనంబు వీటిఁబుచ్చితి; ననుజన్ములు నామీఁదఁ జలము పూని
ధరణీశుతోఁ జెప్పి దండుగ తొంబదివేల రూపాయీలు వేగ గొనిరి;
నిదుపవోలపవిలో నే నొక్కలంజెతోఁ బొల్పార నిద్దురపోవఁ, జోరు
లెలమి జేరాఁ జొచ్చి బలువైన గుర్రంబు వెండిపల్లముఁ బదివే ల్వరాల
సొమ్ము దోఁచుకపోయిరి; జొన్నలూరు
గ్రామ మున్నదియు ఋణవార్ధిఁ గపవకుంటి;
తప్పె భాగ్యంబు, నిర్భాగ్యదశ లభించె;
తమిని సత్కృతి గొనఁ బదార్థంబు లేదు. 17

వ. అదియునుం గాక. 18

తే. సత్కృతులు మున్ను రాజు లసంఖ్య గాఁగ
నందిరి; రవి యుల్ల జగతి నందంద యణఁగ;
ఘనత జగదేకవిఖ్యాతి గలుగదయ్యె,
వ్యర్థ మయ్యెఁ బదార్థంబు వారి దెల్ల. 19

క. అపకీర్తియుఁ గీర్తియు భువి
నెప్పుడుం బోవండుఁ; గీర్తి కియ్యఁగవలయున్

విపులముగ ధనము; మా కెపు
డుపకారము గాఁగఁ జెప్పు మొకకృతి సరగన్. 20

క. చెప్పెదము హాస్యరసముగ
గుప్పున ముం దెవరుఁ జెప్పకొనని కథదిగా
నిప్పుడు నాకును నొప్పుల
కుప్పకు నీ చంద్రరేఖకును ముద మొదవన్. 21

క. సింగి సుమీ మును పేరున;
భృంగి సుమీ నాట్యకలనఁ; బేర్కొన మఱి సా
రంగి సుమీ గతి; దీనికి
లొంగి సుమీ విషమశరుని లోఁగొంటి వెసన్. 22

తే. వారకన్యక యని నీవు కేరవలదు;
దీనితో నాకు నేస్తంబు పూని కూర్చెఁ
గడఁకమై మిత్రవరుఁడు సంకరమనీషి
దీనితల్లిపైఁ గల మోహదృష్టివలన. 23

క. బోగమువా రందఱు న
చ్చో గుంభన మెసఁగ వచ్చి చూడఁగ, నతఁ డా
యా గాయతనములోపల
యోగము గలుగంగఁ జేసె నొగి నిర్వురకున్. 24

క. ఆతనికిఁ గూఁతు రగుటన్
జాతుర్య మెలర్ప మదనశాస్త్రము నేర్పన్;
ఖ్యాతిగ నిది నామదికిన్
జేతస్సంజాతసుమవిశిఖ మై నాటెన్. 25

ఉ. దీని మొగంబుడంబు మఱి దీని మనోహరశుష్కవక్షమున్
దీని ఘనోరుకాండములు దీని వికీర్ణవివర్ణకేశముల్

దీని మధుప్రశాఘనము దీని మహోన్నతరోమరాజియున్
దీని సుబాహుమూలరుచి తెల్లము నా కెదఁ బాయ దెప్పుడున్. 26

ఉ. సొనులఁ జూడనో? మనుపు చక్కని చిక్కని నిగ్గు దేఱు నె
మ్మేనులఁ జూడనో? కడు సమిద్ధతమాలమహీజవిభ్రమా
నూనవిలాసపేశలమనోహర మై తగు దీని మేనికిన్
గానఁగరాదు సాటి; యెట కన్నులఁ గట్టినయట్లు తోఁచెడిన్. 27

తే. సొగసు గులుకంగఁ జెలిమిచేఁ జొక్కఁజేసి,
కొసరి నా మానసం బెల్లఁ గొల్లలాడి,
నన్ను దాసునిఁగా చేసె నన్నగతుల,
దీని వర్ణింపుమా రసోదీర్ణముగను. 28

క. ఎన్నిగతుల విసిగించినఁ
దన్నగు తిట్టగు, వరాలు ధాన్యము సొమ్ముల్
సన్నపుఁగోకలుఁ దెమ్మని
న న్నేమన; దిట్టి వారనారులుఁ గలరే? 29

క. మొగమునస యొదలినసయును
జగురాసుద్రోవినువుఁ జెప్పఁగఁదరమా?
తగ నన్నును దీనిని గడు
సొగసుగ వర్ణింపవలయును సుకవివతంసా! 30

వ. అని యత్యంత ప్రేమాతిరేకంబున వేఁడిన నే నిట్లంటి.— 31

సీ. అదిపురోహితుం డైన కామశాస్త్రి నాయనారముకోఱ కనిచినావు;
సాను విశ్వేశ్వరశాస్త్రి మాన్యంబుల నెలమిఁ గాసాలంచె కిచ్చినావు;
కాసరపూడి మిరాసిదారుల వెళ్లఁగొట్టి కొంపలఁ బసు లగ్గట్టినావు;
ధర్మాత్ముఁడును దంత్రిపత్నుఁడు నగు రంగవిభు నిరుద్యోగిఁ గావించినావు;

క. అప్పలసామికిఁ గావ్యము
చెప్పి యతం డడఁగ, నందుఁ జేరెను వినయం
బొప్పఁగ సంకరకవి; మన
కిప్పు డతని కులము గోత్ర మెన్నఁగ నేలా? 44

తే. మాలవానిని వేఁడి వాఁ డోలి నొక్క
పాక చూపింప దానిలోపల వసించి
కొడుకుఁ దాను వాఁ డిచ్చు కొలుచుఁ దినుచు
నిడుమలకు నోర్చి కాలంబు గడపుచుండె. 45

క. ఏలిక సింగని కాకృతి
వాలాయము నిచ్చి సిరులు వడయఁగవలె నం
చాలోలచిత్తమునఁ దా
నాలోచన సేయుచుండె నాత్మజుతోడన్. 46

వ. అంత. 47

క. పాటి కొంకిరిసాని కతఁడు
విటుఁ డగుటను, నదియు నూరు విడిచి యచటికిన్
దటుకునఁ గూఁతుం దోడ్కొని
మటుమాయలు పన్నికొనుచు మచ్చికఁ జేరన్. 48

క. చేరిన దాని నతఁడు గని
కూరిమితోఁ గౌఁగిలించుకొని మక్కువ నా
హారాదికంబు లిడి సుకు
మారక్రీడలఁ జెలంగి మన్నన నునిచెన్. 49

వ. అది యెట్టి దనిన. 50

సీ. పుట్టకాల్, సొట్టకేల్, వట్టి ప్రేలుం జెవుల్, పట్టు తే కట్టిట్టు బిట్టు గడలు
మిట్టపండ్లును, బెను లొట్టకన్నవయును, బిట్టు లై చుట్టలై నిట్టనిగిడి

పట్టిపై బలుకొంగపిట్టపట్టుపలను గొట్టంగ సమకట్టు నట్టితెల్వి
కిట్టింప నొపలఁ బుట్టి చెంపలమీఁద నట్టాడు నీఁకలకట్టుచుట్టు,
తొట్టిపెపవులుఁ, గుంపర బుట్టిపడెడు
చట్టి కెన యగు నోరును, గట్టి లేక
యట్టిటులఁ దూలు బలు నడికట్టు, వింత
సౌరు గలయది కొంకిరిసాని సాని సుమ. 51

సీ. కల్లు వెల్లుగఁ ద్రావి కాఱుకూఁతలు గూయు;మాలనినైనను మరుగుకొల్పు;
కాసువీసంబులు వాసిగా లంకించి జూడిఁగి నెల్లాళ్లలో జోగిఁ జేసి
యిలువెళ్లఁగాఁగొట్టు; నెక్కువతక్కువ మాటలాడును,పట్టిబూటకపులు;
శంకరశర్మ వేశ్యను నే నెవరితోఁ నవ్వ నటించును నమ్మికలుగఁ
దిరుగుఁ; గూఁతున కెవ్వాఁ దెచ్చి కన్నె
పాయ మిప్పించి యేరీతిఁ బ్రబలునట్లు
చేసెదవో యంచుఁ జెవిలోనఁ జెప్పుచుండు
శర్మగారికి కొంకిరిసాని రొప్పును. 52

క. ఈసరణిఁ దెలుప నాతం
డా సానిం జూచి సరిక నలివేణి! మదిన్
వేసటక తాళియుండుము
నీసుతసన్ సింగన్నృపుని సేన్పనఁ గూర్తున్. 53

క. నా కృతికన్యకకును గన
దాకృతి యీ కన్యకకును సతేనిం బతిగా
నీకొనఁజేసిన మనసున్
జేకుఱు భాగ్యం బటంచుఁ జెప్పి రయమునన్. 54

ఉ. యాగము పేరు చెప్పుకొని యర్థము భూప్రజ వేఁడి తెచ్చినన్,
భోగము సేయవచ్చు నిజపుత్త్రసహోదరదారబంధుసం

యోగము గాఁగ నందు మది నూహ యొనర్చి, యతం డఖండనా
యాగుణమాషితాత్ముఁ డయి యచ్చోటు నెవ్వడి యెల్లభూములన్. 55

క. నీచత్వమునకు రోయక
చూచిన నరు నెల్ల వేఁడి నుడివడక కడున్
యాచన చేసి పదార్థ ము
గోచరముగ సంగ్రహించుకొని వచ్చి వెసన్. 56

ఆ. మాలవాని చెఱువు మఱువునఁ బందిళ్లు
సాలలును ఘటించి సంభ్రమమున
యాజకులను బెద్ద లైన విప్రులఁ గూర్చి
దీక్షఁ బూని నిజసతియును దాను. 57

ఆ. కడఁక దక్షిణాగ్ని గార్హపత్యాహవ
నీయవహ్ను లందు నిలిపి నుంచి
మేఁకపోతుగముల మెదలకుండ వధించి
వెరవు మీఱ నందు వేల్చుచుండి. 58

ఆ. మఖముఁ జూడవచ్చు మనుజుల కిష్టిష్టి
గాఁగ నన్న మిడుఁడు గదిమి యనుచుఁ
గొడుకుతోడఁ దనదు కూఁతుమగనితోడఁ
జెప్ప, వారు లోభచిత్తు లగుచు. 59

క. కొందఱ కొకింత కూడిడి
కొందఱకుం గూర లొసఁగి కొందఱ కిడకే
దండన సేయుచు గెంటుచుఁ
గొందఱఁ దిట్టుచును వెళ్లఁగొట్టుచుఁ గడఁకన్. 60

సీ. పుడమితేఁం ద్లొపిన గుడదధిహైయంగవీనము ల్లోనిండ్లలోన దాఁచి,
కరణంబు లంపిన కందపెండలములు పదిలంబుగా నేలఁ బాఁతిపెట్టి,

బ్రాహ్మణు లిచ్చిన బహువిధాన్నములు లోలోనఁ దమదుచుట్టాల కిచ్చి,
కోమట్లు తెచ్చిన గుడతైలవస్తువు లెల్ల మెల్లనఁ దాన మ్రింగివైచి,
పప్పులో నుప్పు మిక్కిలి పాఁజల్లి,
నేతిలో నాముదపుఁబుచ్చు నింప నించి,
పులుసులో గంజి మిక్కిలి కలయఁబోసి,
భక్ష్యములలోన నిసుమంపుఁ బసిడి గలిపి. 61

తే. మంచి బూరెలు పాణకల మాటు వెట్టి
పిండి బూరె లొక్కొక్క ముక్క పెద్దవారి
విస్తరులలోనఁ బొఱలంగ విసరివైచి
కసరికొట్టిన విప్రు లాఁకటను లేచి. 52

క. కోపించుచు నిందలచేఁ
దపియించుచు నేఁటి కేమి దాఁకుఁ డటంచున్
జపలస్వాంతుం డీతఁడు
కపటపుయజ్ఞంబు సేయఁగవచ్చె నటంచున్. 63

క. చప్పట్లు చఱచుకొంచును,
ముప్పున నిటఁ జేల క్రతువు మొనసి యొనర్చన్
మొప్పేతనంబున? నర్థము
గుప్పున నిక్కపటవృత్తిఁ గూర్చె నటంచున్. 64

తే. జవ్వనంబునఁ గొంకిరిపోని యధర
మనువు గ్రోలిన రోఁత నో మదిఁ దలంచి
వృద్ధదశ సోమపాన మివ్విధి నొనర్చెఁ
గాని స్వర్గాపవర్గేచ్ఛఁ గాదు సుండు. 65

తే. అనుచు జను లెల్ల నిబ్బంగి నాడుచుండ;
నంత సంకరశర్మ యాగాయతనముఁ

గోర్కి-క్రైఁ జూడఁ జీమలకొండ సింగ
నరవరగ్రామణి మానసంబునం దలంచి. 66

క. బోగము మిడిమేళంబులు
భాగవతులు వేఁటకాండ్రు భటకవచాంబుల్
మూఁగి తనవెంటఁ గొలువఁగ
వేగంబునఁ దరలి యాటఁ బ్రవేశం బయ్యెన్. 67

వ. ఇట్లు ప్రవేశించి యవ్విప్రపుంగవు దిట్టించి యమానుష లోనంగి బాలా
సమీపంబునం బటుకుటీరాభ్యంతరంబున నిలిచి తదీయ క్రతుమంత్రతంత్ర
ప్రయోగప్రధానవిధానంబు లాలోకించి హోమం గనుచుండె; నయ్యవస
రంబున. 68

సీ. పెంటలోపలిపుచ్చవిత్తులగతిఁ గప్పు గల గొగ్గిపండ్లుసింగారు మోమున,
విప్పు గల్గిన పేఁడుపుప్పులోఁ బురువులపోల్పునఁ గొప్పున సుమము లమర,
కప్పచిప్పలఁ బోల్పుకొండ బూదిశిరీతిఁ జీపకన్నులఁ బుసు లొప్పు మీఱ,
నగలపేరింటి సున్నపుబొట్లతో ప్పష్టిపిడుతలచందాన దీను లొప్ప,
గడ్డిబొద్దువలెను మేను గానిపింప,
బారకట్టల తెఱఁగున బాహు లలర,
జనకయాగంబుఁ జూడవచ్చెను లలాట
సాంద్రతరరోమరేఖ యా చంద్రరేఖ. 69

క. ఇటువలె నచటికి వచ్చెడు
విటకంటకిఁ జూచి చిత్తవిభ్రమ మొదవన్
దటుకున సింగనృపతి హృ
త్పుటమున సోలుచును దానిఁ బొగడఁదొడంగెన్. 70

క. జడకుచ్చును మెడహొచ్చును
నడనచ్చును గచ్చులేని నలు పగు మేనున్

దాసికాజనులపైఁ గాసువీసం బీక లోఁగొని కుతుకాబ్ధిఁ దోఁగినాఁడ;
నానిబోగనువాండ్రఁ జనవుబలిమిఁ జేసి పలుమా అభీష్టంబు వడసినాఁడ;
కాని యీ సౌఖ్యగము లేదు; కలికిమీఁది
ప్రేమ మును పెఱచోట లభింపలేదు;
మారుని మాయావికారమో, మగువ మచ్చు
మందు చల్లెనో,: నా మది మంపెగించె. 77

క. ఈ మా కీ యింతిని గని
కాముని గర్వం బడంగ గాఢతరంతను
స్తోమంబునఁ బటుసరోష
ద్దామత మెయిఁ జెలిమి చేసెదను నిక్కముగన్. 78

శా. పుణ్యం బేదిన నేననే, జనులు గుంపు ల్గూడి కాదంచుఁ గా
ర్పణ్యప్రక్రియఁ దెల్పినం దెలుపనీ, రాజు ల్మహోదుర్గుణా
గణ్యం బంచును బల్కినం బలుకనీ, కౌతూహలం బొప్ప నీ
పణ్యస్త్రీమధురాధరోదితసుధాపానంబు గావించెదన్. 79

ఉ. చెక్కిలి నొక్కుల న్నిమిరి చిక్కని చక్కని శుష్కవక్షమున్
మక్కువ మీఱఁ గాంచి పలుమాఱు ఖరంబటు తన్నినన్ సరే
కుక్కయుఁబోలె వెంటఁబడి కోడిగ మాడక, భావజార్తిచే
నిక్కడ నిల్వఁగాఁ దరమె యించుకయున్? బెఱమాట లేటికిన్? 80

క. అని యనివారితమోహము
మనమునఁ బెనఁగొనఁగ నతఁడు మఱిమఱి చూడన్,
వనితయు నాతనిఁ దప్పక
కనుఁగొని యనురాగ మొదవఁ గడఁక నుతించెన్. 81

సీ. పరువంపుఁబాయంపుఁదురకబిడ్డనిరీతి మట్టుమీఱఁగఁ బాగఁ జుట్టినాఁడు;
కులుకుజవ్వనపుబల్గుజరాతిపాపని వీలుగాఁ బ్రోగులు వెట్టినాఁడు;

ఆఁడుభాగవతునిజాడ గడ్డము మూతి నున్నగా గొఱగించుకొన్నవాఁడు;
హుడుబుక్కకొమరునియోజ నిజారును బుడమి జీరెడి నగ ల్దొడిగినాఁడు;
మడుఁగులోఁ బడ్డ మహిషంబుమాడ్కి మేన
నందముగ మంచిగంద మలందినాఁడు;
భళిర! యీ సింగనృపతితోఁ జెలిమి గలుగు
బాలికామణిదే కదా భాగ్య మరయ. 82

క. ఖరఘృష్టిసదృశ తేజుఁడు,
సరమాత్మజతుల్యరూపశాలి, బహుశివా
కరసదనుఁడు, హరిసన్నిభ
గురుతరగుణుఁ, డిట్టి రాచకొమరుఁడు గలఁడే? 83

క. ఆ నాలుఁగన్నులందము,
పీవరభుజదండములును, బృథుగండములున్,
కేవలశోభాతనుఁ, డీ
భూవరుఁ డర్హిలిని నాదు భోజుఁ గనునొక్కో? 84

సీ. బూరుగుపెనుమ్రానుపాడువు, గానుఁగఱ్ఱోటివలము దేహము, దాకవంటినోరు,
పెనురసపుంబొల్లి పెదవులు, వలమైన బుఱ్ఱముక్కును, గ్రొత్తబోడిగడ్డ,
మల జ్యేష్ఠ కిరవగు వెళుపు మొగంబును, బొడకంత తలకాయ, కుడితిగూనఁ
బోలెడుబొజ్జయుఁ, బొలసుగన్నులు, లావునడుము, రాపాడెడునడుగులౌర!
పెద్ద యేనుఁగుకాలును గద్దు; గాన
నిట్టి సౌందర్యనిధి భువిఁ బుట్టఁజేసి
నట్టి తామరపట్టి నేర్పరయఁ దరమె
చాలఁ జదివిన సంకరశర్మ కైన? 85

క. నాపూర్వపుణ్యఫలమున
నీపురుషునితోడ నేస్త మెనసినఁ గూర్మిన్

రే పిచ్చైన మా పిచ్చైనఁ
గాపత్యము లేని నిందు కాఁగి లితనికిన్. 86

తే. విడెముతో మందు పెట్టిన విటువ కీతఁడు
బంటుతెఱఁగున నా వెనువెంటఁ దిరుగు;
అట్లు సేయంగ నిఁక నెన్నఁ డబ్బునో కో
మెల్లమెల్లనె కల ధనం బెల్ల లాగ? 87

క. కొంప జవాచ్యవిధంబున
మం దిడుదురు మరులుకొల్ప మా వారసతుల్;
మంపతఁ జెందును విటుఁ; డటు
నింప గదా యిడిన సింగనృపవర్యునకున్. 88

క. ఏలాగు మాటలాడుదు?
నేలాగున మరులుకొలిపి యెలయింతును? నే
నేలాగు లోలుఁ జేయుదు?
నేలాగునఁ గలుగు విత్త మెల్ల హరింపన్? 89

క. అని జాలిమాలి నొందుచుఁ
జన వొప్పఁగఁ బైఁట జార్చి చక్కఁగ నొత్తున్;
మొనవాఁడిచూపుఁ జూచును;
బెనుకొ ప్పటు జాఱఁజేసి బిఱబిఱ ముడుచున్. 90

తే. ఆవ త్రావిన పసర మట్లది మెలంగఁ
జూచి సింహేంద్రభూపతి సొమ్మసిల్లి
మెల్లమెల్లన తెలివొంది కల్లు త్రావి
పరవశత నొందు చండాలు పగిదిఁ దోఁచి. 91

సీ. వలఁ బడ్డ మీను కైవడి, నిప్పు ద్రొక్కిన కోఁతి భాతిని, పెట్టిగొన్న కుక్క
పద్ధతిఁ, గుడితిలోఁ బడిన మూషిక మట్లు, శ్లేష్మంబులో నీఁగ లీల, సన్ని

పాతి చందంబున, వాతంపుగొడ్డు విధంబున, లాహిరీదళము మిగులఁ
దినిన పాశ్చాత్యుని తీరున, నురివడ్డ పక్షి కైవడిఁ, బెనుపాము పగిది,
భూత మూనిన మనుజుని పోల్కి, బెట్టు
మందు మెసవిన మానవు మాడ్కి, దేహ
మెఱుఁగ కెంతయుఁ గళవళం బెసఁగ దాని
పై వలపు నిల్పి కన్ను మోడ్పక యతండు. 92

క. తలనొప్పియుఁ దాపజ్వర
మలసటయును మిగులఁ బొడమ, నసురుసు రనుచున్
నిలువంగ బలము చాలక
తలిమముపై వ్రాలి దానిఁ దలఁచుచునుండెన్. 93

క. అని నంబి నారసింహుం
డను వొప్పఁగ నిట్లు చెప్ప, నా తంబళి వి
రన యావలి కథ లెస్సగ
వినయంబునఁ జెప్పు మనుచు వెస వేఁడుటయున్. 94

ఉ. నీచచరిత్ర! వారరమణీబహురక్తగాత్ర! నిత్యదు
ర్యాచకమిత్ర! సజ్జనపదార్థపరిగ్రహణైకసూత్ర! సు
ష్కాచపిశంగనేత్ర! నృపకర్మమహాలతికాలవిత్ర! శ్రీ
బాచినృపాలమాళికులవార్ధికనద్బడబాగ్నిహోత్రమా! 95

భు. దురాలాపదుర్దోషదుర్మార్గనర్తీ!
ధరామండలఖ్యాతధౌర్త్యాపకీర్తీ!
పరస్త్రీజనాసక్తభావప్రపూర్తీ!
స్థిరాయుస్థిరారాజాతదీర్ఘోగ్రమూర్తీ! 96

గ. ఇది శ్రీమజ్జగన్నాథదేవకరుణాకటాక్షవీక్షణానుక్షణసంలబ్ధసరసకవితావి
చిత్రసలలితాపస్తంబసూత్రకౌండిన్యసగోత్రకూచిమంచికులపవిత్రగంగనా

మాత్యపుత్త్రమానితానూనాసమాన నానావిధరంగ త్రిలింగ దేశ భాషావిశేష భూషితాశేష కవితావిలాస భాసురాఖర్వసర్వలక్షణ సారసంగ్రహోద్దామ శుద్ధాంధ్రరామాయణ ప్రముఖ బహుళ ప్రబంధనిబంధనబంధురవిధాన నటీన శబ్దశాసనబిరుదాభిరామతిమ్మః విసార్వభౌమసహోదరగురుయశో మేదురవివిధ విద్వజ్జనవిధేయ జగన్నాథనామధేయప్రణీతం బైన చంద్రరేఖావిలాపం బను హాస్యరసప్రబంధరాజంబునం బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు

# చంద్రరేఖావిలాపము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీరహితగేహ! చండ్రీ
జారవధూసాహచర్యవర్ధితబహురో
గారూఢదేహ! కిలసర
సీరుహవనపూర్ణచంద్ర! సింగనరేంద్రా! 1

వ. ఆకర్ణింపుము తావకీనకథావిధానంబు; యథార్థంబుగాఁ దొల్లి శ్రీశివబ్రాహ్మణపఙ్క్తాగ్రగణ్యుం డైన వీరభద్రభట్టారకేంద్రునకు శ్రీమద్వైఖానసవంశోత్తంసం బగు నరసింహాచార్యవర్యుం డవ్వలి కథ యిట్లని చెప్పం దొడంగె. 2

క. అక్కామాతేశ్వరి యెద గం
టిక్కంబో కిఁడు నాయుచేత నటించున్
విక్కముఁ బల్లికడుపుఁ జని
మిక్కిలి నక్కథ యెఱుంగ మాలువునఁ దెలుపన్. 3

క. మాతండ్రి క్రతువు కనుఁగొన
నాతతగతి సింగనృపతి యరుదెంచె నినున్
రాతిరి గని మోహించుట
కోఁతికిఁ గొబ్బెర లభించు కొలఁదియు కాదే? 4

క. ఏమేమి! సింగభూపతి
నీమీఁదం గన్ను వైచి నిష్ఠురజవన
త్కామశరజాలనిర్ధూ
తామేయసత్వుండు డయ్యెనా? మేలు భళీ! 5

క. కూఁతురా! యాతురపడి నీ
నాతనిఁ జేరంగఁబోకు, మటు తాళుము; వాఁ
డేతెంచు సంచులను ధన
మాతతగతి నించుకొంచు వ్యామోహమునన్. 6

క. వల పెంత నీకుఁ గలిగినఁ
గులధర్మము తప్పరాదు; కుమ్మరపురువుం
బలెఁ దిరిగి పొట్టపోసుక
వలెఁ జుమ్మా ముద్దుగుమ్మ! వగ నా యమ్మా! 7

వ. అని యనేకప్రకారంబుల లాలించి మేలెంచి తన కాలంబునాఁటి నాట
కంబులు బూటకంబులు బోటివనంబులు నీటులు కూటంబులమాటలు
చాటుమాటు లేక తేటతెల్లంబుగా నబ్బోటితోఁ జాటం దొడంగె. 8

క. శంకరశర్మం బోలు ని
రంకుశులను మరులుకొల్పి యర్థము చాలన్
లంకించి నాకు నమ్మిన
కింకరులుగఁ జేసికొంటిఁ గిమ్మనకుండన్. 9

క. ము న్నెంతవాఁడు వేఁడినఁ
గన్నెఱికం బీక మీఁదుగట్టితి నీకై
మన్ననఁ గైకొ మ్మని విటు
ల న్నిత్యము మాయచేసి లంకింతు వరాల్. 10

ఆ. ఒకఁడు గానకుండ నొక్కని రావించి
యొకనిచెంత కేఁగుచుండి నడిమి
దారి నొకనిఁ గూడి తబ్బిబ్బు గావించి
ధనము కొల్లగొందుఁ దవిలి ముందు. 11

క. సందుల మంత్రంబులచే
విందులచేఁ బూఁతచేత పీఠంబులచే
తంపసపదముల నాటల
మందులఁ గావించి విటుల మానక దోఁతున్. 12

ఉ. అందలముల్ శతాంగములు నశ్వచయంబులు పాలకీలునున్
మందగశైలరాజనిభమత్తగజంబులు వెంట నంటి రా
ముందఱఁ బొంగుగా ధనముమూటలు వేఁటలు కాన్క లంపి నా
మందిరసీమఁ గాతు రసమాననృపాగ్రము లెల్ల ప్రౌఢులన్. 13

క. నీ కేమి చెప్పవలయును?
లోకపు తెఱుంగునరు, నాఁటిలో మదనుఁ డహా!
నా కనుసన్నల మెలఁగును;
కాకుండిన, నింత సొమ్ము గడియింతు నటే? 14

క. గుప్పున జను లాడుకొనన్
మెప్పొందితి సాటిసాని మేళంబులలో;
చెప్పినఁ బగ్గగ నీ నాది
కప్పాడు తోఁచునా; మఱెవ్వ రిప్పటి సాటుల్? 15

క. చెలఁగునెఁ బిట్టులు చేరఁడు
పొలుపున నా యింటి చుట్టూ భోగాభిరతిన్
పలుగు గులాములు. తురకలు
పలుగొని కానుకలు గొంచువత్తురు సుమ్మీ. 16

క. కట్టిన కోకలు గట్టక,
పెట్టిన మణిభూషణములు పెట్టక, సిరులం
దొట్టి విటకోటి కొలువఁగ,
దిట్టతనంబునను గొలువుదీర్తుఁ గడంకన్. 17

క. జాదంబులఁ బటుకేళా
నాదంబుల సందెలాస్యనర్తనముల మాతల్
ఖేదించి విటజనంబుల
చే దండుగ గొందు ధనము; చెప్పఁగ నేలా? 18

సీ. వలిపచెంగావిచావడ కటిస్థలిఁ దాల్చి, జిలుఁగైన సరిగంచుపైట గట్టి,
వలుఁదవక్షమునిండ మలయజాతము పూసి, కట్టువాసనికంచుకంబు దొడిగి,
నీలుగా సిగ వేసి, పూల దండలు చుట్టి, ముత్యాల తాటంకములు ఘటించి,
కడియాలు కుంకేళ్లు గంటలొడ్డాణంబు బవిరెలు బావిలీల్ బన్నసరులు
నుంగరంబులు కెంపుల ముంగరయును
మొదలుగల సొమ్ములను దాల్చి, మురిపె మమరఁ
దిరుగుచును విటకోటుల స్మృతి గలంచి,
హొన్నులు గడింతు మరునాన చిన్నదాన! 19

క. నా వగ నా యొసపరినడ
నా వాలుంజూపుకోపు నా మాటలతీ
రా వంతయు నీ వెఱుఁగ; వ
హా! వన్నెలకానికూఁతురా! యిది మేరా? 20

క. పండ్లకుఁ బటుత్వ మెడలెను,
గండ్లకుఁ జత్వాం మొనసెఁ, గాయము ముదిసెన్,
రొండ్లును నరములు బిగివడె,
నిండ్లు తిరుగు నేర్పు చెప్పి, స్మృతి ముఱి పూనెన్. 21

క. వృద్ధత్వ మివ్విధంబున
సిద్ధించినఁగాని, యిపుడుఁ జిల్లర బోజుఁగుల్
బద్ధానురాగులుగ నని
రుద్ధజనకు కథలు చెప్పి రోవెల గొననే? 22

ఆ. పెల్లు కల్ల లల్లి బొల్లిమాటలఁ జల్లి
మెల్లమెల్ల నిల్లు గుల్లసేయు
తల్లి గలుగు లంజె నల్లోలమాతిఁ జేయు
పల్లవులకు సౌఖ్య మిల్ల జగతి. 29

క. రమ్మంచును నమ్మించును;
బొమ్మంచుం గోక లాకుపోఁకల్ రూకల్
గ్రొమ్మించు సొమ్ము లెమ్మం
దెమ్మంచును లాగు లంజె తెగి విటుఁడీఁగన్. 30

సీ. లఘువర్ణగురువర్ణలక్షణం బెఱయక, సమాసభావార్థముల్ సంగ్రహింపని,
వృత్తభంగమునకు వెఱ పింతయును లేక, గణదుర్గుణవిరామగతులు గనక,
యపశబ్దములకు రోయక, సంధివిగ్రహప్రాగ్రహాదివిచారణము నెఱి,
భావం బెఱుంగక, పండితోత్తములతోఁ గలహమాడ్లన్, సుపాఠకుల మాని,
యతులఁ బోనాడి, మూర్ఖసంగతి వహించి
తిరుగు వెలబోటి జీవనస్థితి గణింపఁ
గుకవికృతకావ్యరూపానుగుణత వూని,
యరసి చూచిన నిస్సార మగును బిసప. 31

క. లంజెయును బీఱకాయయు
ముంజెయు బాల్యమునఁ జాల మోహముగొల్పున్;
రంజన చెడి ముదిసినవెను
కం జూడరు, ముట్టఁబోరు గవ నరు లెందున్. 32

చ. పలువలు చెంతఁ జేరి యొక పాతికసేబులు చేతి కిచ్చినన్,
జెలువకు భూషణం బయిన సిగ్గును నాయఁగఁ ద్రొబ్బి, నాఁడె తా
పలుగుఁదనంపుఁ జేష్టలను బాగలువెట్టిన నోర్చి, ప్రాణికిన్
గులుకుచునుండు నప్పుడుపుఁగూఁటి వెలంది కొలంది చెప్పఁగన్? 33

క. ఏలాగైనను సింగన్న
పాలునిదరిఁ జేరి, స్నేహభావ మొలర్పన్
లీలాలోలత నుండెదఁ;
జాలును నీ లంజెజాతి సంబంధ మిఁకన్. 39

క. అని తల్లిమీఁదఁ గనలుచుఁ
గనుగొనలను బాష్పవారి గడువడి జాఱన్
జని నిజశయ్యాతలమునఁ
దను వొయ్యనఁ జేర్చి యతనిఁ దలఁచుచునుండెన్. 40

క. అత్తఱిఁ జంద్రిని జిత్తజుఁ
డొత్తి మహోన్మత్తసాయకోత్కరము ప్రయో
యత్తనుతి నేయఁ బెంపఱి
చిత్తంబునఁ గళవళించి చెడి మూర్ఛిల్లెన్. 41

ఆ. ఆర్చి పేర్చి మారుఁ డారీతి నేయంగఁ
గూర్చి కూర్చి జొల్లు గార్చుకొనుచు
మూర్ఛ తెలిసి తనదు ముంజేయి నోటిలోఁ
దూర్చి యతనిఁ గూర్చి దుఃఖపడియె. 42

ఉ. హా! యతిసారసుందరతరాంచితవిగ్రహా! నిన్నుఁ జూచి నే
నాయతమోహపాశవశ నైతిని; సన్నకసన్న నిన్నుఁ జే
డాయఁగవచ్చి నా తనుతటస్ఫుటఘుట్టితపంచసాయకా
మేయశిలీముఖచ్ఛటలు మీఁటి సుఖింపుము సింగభూవరా! 43

క. వారస్త్రీలకు మెచ్చరు
మారుండవటంచు జనులు మరిమరి దెన్నం
గా నూఢిగ వినియుందు; న
దారవిరహతాప మార్పఁదగదే నీకున్? 44

క. చూచినయాస్వాదే ముద్దిసెఁ
చూచి మరులుకొంటి వారసుందరి నగుటన్,
నీ చతురకార్యపద్ధతు
లే చొప్పుగ నడప నేర్తు నెంతయుఁ బ్రేమన్. 45

క. వాఁడె మొగమ్ము నగమ్మును
నీ చరణము లాన; యింక నీ విట నాకున్
గోచరుఁడవు గమ్ము వెసన్
బాచిన్నృపకుమార! వారనారీమారా! 46

క. వలరాజు చేతి యాతన
బలువయ్యెను, దాళఁజాలఁ; బ్రత్యక్షుఁడ వై
చెలిమిని సుఖింపు మింకన్
గులుకుచు సింహేంద్రభూప! కోమలరూపా! 47

క. చల మేటికి? రమ్మికఁ, గో
మలరూప! పికాంగనేత్ర! మన్మథబాధల్
తల మిగిలి తాడిపోడ నై
బలిసెను, దమి మీఱె నాదు పజ్జను వేగన్. 48

క. సొమ్ములు కోకలు రూకలు
దమ్మని నిను జెన్కసేయు; దీకొని ఖరమా
గ్గమ్మునఁ దన్నుము పైఁబడ
నమ్ముము; పెక్కేల? వారనారీలోలా! 49

వ. అని మహోన్మాదావస్థచే దేహస్వాస్థ్యంబు లేక చీకాకుపడుచు ననేక
ప్రకారంబుల విలపించి యిట్లు ప్రలాపింపఁదొడంగె. 50

ఉ. క్రమ్మినకెన్కఁ గప్పుకొను కంబళికొంగు తొలంగఁజేసి, మూ
ర్ఖమ్ముల నీ కరమ్ములను గట్టిగఁ బట్టి పెనంగకుండ, హా

స్తమ్ము నిగిడ్చి నిన్ను రభసమ్మున గిల్లుచు జొల్లు కార్చుచున్
త్రిమ్మరి దీఱ వాఁడెపుడు దీకొని నొక్కునో? చెయోష్ఠబింబమా! 51

ఉ. ఎంపటిచేతులన్ నలఁగి యిమ్మెయి హాయి గనంగలేవు; బల్
కెంపలిరాకుఁడాల్వాయలు గిల్కొనున ల్లాఘరంబు నెంపటిన్
కందఁగఁజేయ, నీవును వికారము నొందఁగలేదు; చిత్ర మీ
మందుని సింగనిం దలఁచి మాటికిఁ గుందెద వేల? డెందమా! 52

క. ఆకా? పోఁకా? దూకా?
కోకా? మేఁకా? మఱేమి గొని వచ్చెడునో?
నీ కాతనిపైఁ దమిగొని
కాఁకల నిటు పొగుల నేల? కట్టిఁడి మనసా! 53

సీ. తురకబొజుంగులు, నెఱుకుబొజుంగులు, గుల్లాపుబొజుఁగులు, గొల్లబొజుఁగు,
లలకమ్మబొజుఁగులు, బలిజెబొజుంగులు, చాఁకిబొజుంగులు, సాలెబొజుఁగు,
లబిసీబొజుంగులు, పబువుబొజుంగులు, బాఁపనబొజుఁగులు, బంటుబొజుఁగు,
లింగిలీజుబొజుంగు, లీడిగబొజుఁగులు, పింజారిబొజుఁగులు, బెస్తబొజుఁగు,
లెంద ఱెంత కలంచిన, నించుకైన
జడియకుండెడిదాన; వాశ్చర్య మిపుడు
చూడ, సింగనిఁ బోలు చచ్చుబొజుఁ గేల?
కాంక్ష గైకొనెదు మో దోసకారి మనస! 54

ఆ. త్రుళ్లిపడియె దేల? తొట్టివక్త్రమునుండి
ప్రల్లదంబుచేతఁ బైటఁబడుచు
నల్లిబిల్లిగొనఁగ నుల్లసిల్లుచును నీ
తల్లిపాయపోల్కి జొల్లునాల్క! 55

వ. అని మఱియు మనోజాతనిశాతచూతసాయకవ్రాతఘాతయాతనాభూతచే
తోరవింద యై, కంది కుందుచుఁ, గొందలం బందుచు, వైవర్ణ్యంబు నొం

దుచుఁ, బాష్పపయిం బడుచు, లేచుచు, వంగుండుచుఁ, దొంగుండుచు, వ్రాలుచు, సోలుచు, సొక్కుచు, వెక్కి వెక్కి యేడ్చుచు, వెడవెడం గన్నులు తేలవేయుచు, విహ్వలించుచు, విసువుచు, విన్నంబోవుచు, వీణం బాణుల ముట్టక, బట్ట కట్టక, భోసంబు మెసవక, సురాపానంబు సేయక, ప్రాఁతబొజుంగులం బలుకరింపక, సుడివడుచు, స్రుక్కుచు, నసురుసు రనుచు, నడునెత్తి మొత్తుకొనుచు, నాయాసంబు నొందుచు, నారాటం బునం గుందుచుఁ, జింతించుచుఁ, జేతులు పిసికికొనుచుఁ, జిన్నఁబోవుచు, సీత్కారంబు సేయుచుఁ, జిడిముడిపడుచుఁ, జీకాకు నొందుచుఁ, జెమ్మ టలం దోఁగుచుఁ, బలవరించుచుఁ, బండ్లు కొఱుకుచు, శైలు కౌఁగిలించు చుఁ, బరవశం బగుచు, బెంగగొనుచు, బిసరుహాంబకుం దిట్టుచు, బిరబిర శరీరం బెఱుంగక శిరోజంబులం బెఱికి పాఱవైచుచు, నలుదిక్కులు కలయం జూచుచు, నవ్వుచు, 'హా! సింహేంద్రపుంగవా! వచ్చితే?' యని లేచి 'నా సఖున్నయిం గొప్పించుడు' యనుచుఁ, బరిపరివిధంబుల మతిదప్పి, నెట్టిగొనిన నేఁపి తెఱంగున, సర్గంబులో నాడెడి నాడె కైవడి, మధుపానంబు చేసిన వానరంబు పోలిక, మావి కఱుచు నక్క పెక్కునఁ, బిడుగు మొత్తిన యనుని చందంబున, మూఁగ లాగున, ముల్లెపోయి పొరలు ముండవిధంబున, ముక్కుచు, మూల్గుచు, గ్రుక్కిళ్లు మ్రింగుకొనుచు, మొగంబు దిగవైచుచు, మూర్ఛిల్లుచుఁ, దెలియుచు, మోహదాహాతితాపం బునం దల్లడిల్లుచుండె నయ్యవసరంబున. 56

క. కొంకిరిసాని కి పంతినయుఁ
గింకరు లెఱిఁగింప, దుఃఖకీలితమతి యై
కొంకుచుఁ గూఁతురి యుపచా
ర్యంకము చేయంగఁబోయి హాహా! యనుచున్. 57

తే. బిడ్డరో! నీకు స్మరరోగపీడ యున్న
పెక్కుమాఱులు కలిగిన ప్రుక్కి కీవె
మాన్పుకొంటివి; యిటువంటి సాయపు వాఁడు
కలుగనయ్యెను; వట్టి నుక్కుర్తి మొసఁగె. 58

క. ఆరయ సింగనృపాలుని
పేరును బెం పేమి? యతని పెద్దలు ము న్నె
తీరున నుండిరి? యీసిరి
వీరాగ్రణి వీరభద్రవిభుఁ డొసఁగెఁ గదా! 59

తే. ఇంతె కాని, జమీందారుఁడే యతండు?
పరమమూర్ఖుండు, బహులోభి, పాపచిత్తుఁ,
డాత్మదాసీప్రియుఁడు, వాని కాసచెంద
నిహపరసుఖంబు లేదు; నీ కేటి వలపు? 60

ఆ. ఎదురు వెట్టి వేడ్కఁ జదరంగ మాడెడు
పగిది నీకుఁ గల్గు పడుపుఁగూటి
సొ మ్మొసంగి చేర ర మ్మన్నఁ గైకొను
నట్టివాఁడు ముద్దుపట్టి! వినుము. 61

సీ. పండ్లు తోమఁడు; పదప్రక్షాళనము సేయఁ; డమావసనాఁడైన హరిదినంబు
నందైనఁ గడు నూరఁబందిమాంసము లేక కూడు భుజింపఁడు; గురుముఖంబు
గాఁడు; తమ్ములఁ జేరనీఁడు; సత్కవులకు వైశ్యుల పెండ్లిండ్లవలస నన్ను
కట్నముల్ తా దురాగ్రహమున లంకించి లంజెల కిచ్చును లజ్జ మాలి;
వినయమునఁ దండ్రి తద్దినమునను విప్రుఁ
బిలిచి యొక కాసు తవ్వెఁడు బియ్య మీఁడు;
కుత్సితుఁడు లోభి, చీమలకొండ సింగ
రాజు; వానిని దలపెట్టరాదు మనసు. 62

ఉ. పూచిన శాల్మలీద్రుమముఁ బోలిన లోహితదీర్ఘదేహమున్,
గాఢసమానపీతరుచిఁ గ్రాలెడు కొంచెపుఁ గన్నుదోయి, శ్వే
త్రాసములాక్షి ప్రేలెడు విశాలతరాస్యముఁ గల్గువాని సం
కోచము లేక చూచి నలగొంటివె? నారివధూశిరోమణీ! 63

క. నానులకు గబ్బిదెబ్బలి,
పూని కసంగొనిన వాఁడు పోనీఁడు గదే;
హాని యొనరించు, హా! లత
కూన! సరగఁ బాఱిపొమ్ము కొట్టామునకున్. 64

తే. నల్లనాఁగును గంజాయి కల్లుఁ ద్రావి
యొడ లెఱుంగక వచ్చి దుంగుడుకు సేయు,
ప్రాణములతోడ విడువఁడే పాపి; వాని
గుండువలె నన్ను మేనిపై దుంగ లెత్తు. 65

క. వాత్తుకొని మెయి నలంగఁగ
మొత్తును మత్తిల్లి, పాపములకును దంపం
బొత్తిసు మని వేఁడిన వినఁ
డెత్తులవ బాఱాంగు; వాని కాసింతు రటే? 66

క. పాపి! విను, వట్టి యూసలు
చూఁపి న్యూఁడం డబ్బు; లంటినొమ్ము భుజించున్;
పాపాత్ముఁడు, నశుకర్ముఁడు;
మాపును రేపును భ్రమించి వాతి కడుఁ గలఁచున్. 67

క. ముప్పుల కా లాడించుచుఁ
గుప్పులు రాలంగ వాఁడు గొనకొని తెప్పున్,
ముప్పుట తీరడిలోనలఁ
జప్పుడనె చంద్రరేఖ! సాంద్రసురేఖా! 68

క. పెద్దల నెఱుఁగఁడు; మాటలఁ
బద్దులు పచరించు; గర్వి; భామామణులం
దెద్దువలె మెలఁగు; నీ కా
బుద్ధి వలదు, మానుమమ్మ పుత్తడిబొమ్మా! 69

క. ఖలుఁ డైన సింగన్నృపుఁ డీ
యిలపై నిన్నాళ్లు బ్రతుకునే? కమలాంబా
గళకలితకనకమయమం
గళసూత్రోత్కృష్టమహిమఁ గాక, కుమారీ! 70

తే. రొక్క మిచ్చెడు విటుఁ జూచి దక్కినట్లు
తక్కుచును బొల్లి మాటలఁ దనుపుఁ గాని
నిక్కముగ మానసం బీయ నిశ్చయించి
వారకన్యక యేరీతి వలచు నఁటవె? 71

క. ఎక్కడి సింగన్నృపాలుం?
డెక్కడి యడియాస? వలపు లివి గూడ; విఁకన్
గ్రుక్కిన పేను తెఱంగునఁ
గిక్కురు మనకుండఁ జనుము గేహంబునకున్. 72

వ. అని వినయవిస్రంభగంభీరసంరంభంబులు గుంభింపం బలుక, నచ్చిలుకలకొలికి కంతకంతకు వింతవింతలుగ దురంతనితాంతవిప్రలంభవేదనాభరంబు తరంబు గాకుండఁ గరంబు దళం బగుటయుఁ, బరవశత్వంబు నొంది మాఱుమాటాడ నోడి, యోడిన కోడి చందంబునఁ దల వ్రేలవైచుకొని, కదలమెదలనేరక కన్నులు మూసికొని, యూరక శరీరంబు నీరు విడువ శయ్య నొయ్యన వ్రాలి తూలం, గనుంగొని బెంగను లొంగి దుఃఖాంభోధిమధ్యంబున మునింగి కన్నీరు లేఱు లై పాఱి వెల్లివిరియ డిల్లపడి తల్లడంబున నుల్లం బవియ మెల్ల మెల్లన నప్పల్లవమనోభూతంబున కాతతగతిఁ

జ్లనిపనులు సేయుందలంచి తన దాసికాజనంబులుం దానును దాని శయ్యా
తలంబు చేసరగి. 73

సీ. స్నానద్రవ్యములఁ గలిఁయుష్ణపొడి చల్లి, పైఁ గొండపల్లేరు ప్రస్తరించి,
కర్కశశుష్కపత్రంబున గేగటి దూలగొండిచిగుళ్లు గలుకొలిపి,
కన్నులలోన సర్కటక్రిములు నించి, ముసుఁగ్రోళ్లలో నావముద్ద లుంచి,
వీనులలోపల వేఁడినూనియు పోసి, నాలుకఁ జెముడుపా ల్చాలఁ బొడిచి,
పేస లెంసున్న మెంతయు మెత్తి, నెత్తి
గొటిగి, నిమ్మపులుసు గంట్లఁ గ్రుమ్మి, లోని
కీసుపు నేపాళము లోసంగి, యిట్లు శిశిర
కృత్యములు సేయ, నప్పు డక్కటవనిత. 74

క. బడెబడెఁ గ్రక్కుచు గ్రుక్కుచు
బడిబడి బహుభంగి మీఁఱఁ బొఱలుచు మఱి తా
నోడ తెలుఁగక పెను మూర్ఛం
గడు సోలఁగఁ, నల్లి గాంచి కటకటపడుచున్. 75

ఉ. సంకర సోమపీఠ కట సర్వము వైశసు తెల్పసుండినన్
గింక వహించి దుఃఖపడుఁ, గేవల మాతఁడె దీనిఁ గన్నవాఁ;
డిం కట నుండనేల? యని యేడ్చుచు నాతనిఁ జేరి యంతయున్
జంకక చెప్ప, నాతఁడును సంభ్రమదుఃఖభయాగ్రచిత్తుఁడై. 76

తే. వత్తి లంజెవు, కాఁగున్న విషమబుద్ధి
శిశిరకృత్యంబు లీరీతిఁ జేతు వఁటవ?
పల్లదమున సన్నమున జెట్టి పల్లనంగు
లోని కిప్పించి చేయింపు తాన మిపుడె. 77

క. ఈ చందంబునఁ జేసిన
నీ చిన్నది బ్రతుకు నిపుడు నిక్కము; దానిం

కటకటా! చంద్రరేఖావికటకటాక్ష
వీక్షణాక్షీణవాతూలవిజిత దేహ
జీర్ణభూరుహముఁ డగుచు నా సింగనృపుఁడు
పరవశత లేచి, వనలతాతరులఁ జూచి.

క. కమ్మవిలుకాని తూపన
నమ్మఖిశాలాంగణమున నగపడి చనె; నో
యుమ్మెత్తకొమ్మ! నీ వా
క్రొమ్మెత్తనిమేని సానికొమ్మం గనవే?

క. వింటివొ లేదో, యిపు డొక
తంటా గొని తెచ్చుకొంటిఁ; దలఁగని వలపుం
గొంటిని గనినది మొదలుగఁ;
తంటెపు మోకా! యి దేమి తబ్బిబ్బోకా?

ఆ. కప్పు విప్పు గలుగు గొప్ప కొప్పలబారు
నప్పులంతి చొప్పు ద్రిప్ప కిప్పు
డొప్పు మీఱు మీరు చెప్పరే గుప్పున
మెప్పు లిత్తు నుప్పి తుప్పలార!

క. మీ రింద లొకటి యై పొలు
పారం దిటమూనఁ బల్కి యతిరయమున నో
కోరిందపొంకలారా!
సారేందుముఖీలలామ జాడఁ దెలుపరే.

క. మారార్తి నెంత వేఁడిన
మా రాకడఁ దెలియఁ జెప్పి మా లావక రయో
జోరీఁగలార! మీ రా
నారీరత్నమును దెచ్చి నా కొసఁగరు గా?

క. కల్లు కడుఁ ద్రావి ప్రేలుదు
హల్లీసక మాడుకొనుచు నది యిప్పటి సు
వ్యల్లీల రాదె? బల్లీ!
పిల్లీ! కడు ముద్దుఁజిలుకు పిల్లల తల్లీ!

ఉ. పోదుల మ్రానులార! కడుఁ బూచిన సీతిరిదొంకలార! బాగ్
బాడినచెట్టులార! ఫలభాగ్యసుసమృద్ధిసుజంబులార! యా
వేడుకకత్తె చిత్తమున వేడుక మీఱఁగ నేపబంటుగా
నీడకు నీడ కొక్కతె రహిం బఱతేరదు గావ చింపరే.

క. ఊరుతాపకరణకారణ
వరతామరసాశుగములు వైచె మరుఁడు; వి
స్ఫురితాంగిఁ జూపు మిపు; డో
యుఱుతా! మా మాట నేయు నొప్పినఁ గొఱఁతా?

క. బెండా! మూర్కొండా! యా
దొండా! మీ యండ కిపుడు తోరము మీఱన్
దాండవ మాడుచు వచ్చెన
కొండెంబులమారి చంద్రి! కొంకక చెప్పుఁడా.

క. కృకవాకులార! మావ్య
త్ర్యాకలాసములార! గవయకీశశశాసుని
వ్రాకజాతులార! బోగపు
సకియలతలవిన్నఁ జంద్రసానిం గనరే?

క. ఏలినవాఁడను సింగఁడ,
వాలెంబును దానిఁ జూచి వలచినవాఁడన్;
స్థూలోదరాన్వితను గణి
కాలలనం జంద్రరేఖఁ గంటిరె? ఖరమా!

తాళఫలోపమానసముదగ్రశిరం బది యెుక్క చేష్ట, నీ
లాలలితోపగూహనకథాకలనన్ సుఖియింపఁ జేయుమా. ॥

శా. శోషించెన్ మదనోపతాపమున నత్యుద్రోన్నతోష్ణంబుని
ర్దోషాద్యుత్తనుయష్టి; పుష్టిగను మందుల్ చేసినన్ గాదు; సఖా!
రోషం బూనక నేఁ డపారకరుణాసాంద్రార్ద్రసంతేజ ద్ర
యోషిద్రత్నమ! చంద్రి! నీ యధరపీయూషంబు నా కీయవే. ॥

క. పెక్కు తెఱంగుల నీకున్
మ్రొక్కెదఁ; జల మేల? నాదు మోహము తీర్పన్
జక్కెరవిలుతుఁడు సాక్షిగ
మిక్కిలి కృప నన్ను నేలుమీ దాసునిఁగాన్. ॥

క. మే లెంచెద; సామ్రాజ్యం
బేలించెదఁ; దొంటిసతుల నెల్లరకంటెన్
లాలించెదఁ; బాలించెదఁ;
దేలింపుము నను సుఖాబ్ధిఁ దేఁకువ మీఱన్. ॥

క. చక్కెరవిలుతుని బారిన్
జిక్కితి; నీ పాదయుగకుశేశయములకున్
మ్రొక్కితి, దక్కితి; నిఁక నీ
తక్కులు దిగఁద్రొక్కి నన్ను దయఁజూడఁగదే. ॥

తే. గంధ మత్తరు జవ్వాది కస్తురియును
దొడ్డ యొడ్డాణమును గమ్మదోయి త్రొత్తి
పట్టు చీరలు కుచ్చుల బావిలీలు
దొక్క మివె గొమ్ము నీ లంజెటక్కు మాని. ॥

తే. తాళఁజాలను, నీ వింత జాల మేల
చేసెదవు? నన్ను మిక్కిలి చెలిమి మీఱ

ఉ. చాపల మోపు; చంద్రి నను జయ్యనఁ జక్కెరవింటిసంట బల్
తూపులపాలు చేసి, కసితో బలెఁ జూచి సుఖింపకుండ సం
తాప మొనర్చి యేఁగె; నిటు తాళు మటన్నను దాళ వేల? యు
ద్దీపకశక్తిఁ జూపు నెడఁ బ్రెల్లెదఁజుమ్ము కడింది డెందమా! 124

ఉ. మెచ్చగు చేఁపకంపునకు మేల్పడి ముక్కునఁ బక్కు బూడఁగా,
హెచ్చగు నల్లరంగున రహిం గను చెందిరి వంటయింటిలోఁ
జొచ్చుచు వచ్చుచున్ మిగులఁ జొక్కుచు నంట్లను దోముచుండఁగా
నిచ్చఁ జెలంగి నిన్నుఁ గన నెన్నఁడు గల్గునొకో శరీరమా! 125

ఉ. పెక్కుతెఱంగులం గరనిపీడన మే నొనరించి పట్టినన్
వ్రుక్కక మిట్టిమిట్టి తల చూపుచు గుండెలు బ్రద్దలౌ గతిన్
మొక్కలపాటు చేసెదవు; మున్ను వెలందులఁ జూడవంటివే?
త్రొక్కెదఁ దల్లడిల్లకుము, మూర్ఖత మాను మొకింత డెందమా! 126

ఉ. కాయలు గాచె నీదు తలకాయ, దురాశ్రయహేయవారక
న్యాయతదుర్గహీనసగృహాంతరనిత్యగతాగతక్రియన్
తా యని ద్వారబంధము తటాలునఁ దాఁకుటఁ జేసి మాటికిన్;
కాయమ! యింకనైన గుటిగైకొని యూరక యుండలేవు గా? 127

ఉ. గద్దటిసాని బెబ్బులిని గాంచినయంతనె, తల్లడిల్లుచున్
నిద్దుర మేలుకాంచి కడు నిక్కుచు నీల్గెద; వింద్రియంబులన్
బెద్దవు; నీ వెఱుంగని ప్రవీణపుబుద్ధులు లేవు; గాన నీ
విద్దెలు మాను, మాను మవివేకము; డెందమ! నిన్ను వేఁడెదన్. 128

ఉ. పంకము లంటె నాకు బహుభంగుల నీ కతనన్ బవిత్రలన్
బంకజపత్రనేత్రలను బల్మిని బట్టుటఁ జేసి; వారికై
కొంకక మొండిగోడలను గొబ్బున దాఁటెడువేళఁ బాటునన్
బంకము నీకు నంటెఁగద పాపపుదేహమ! యిట్లు సేతురే? 129

ఉ. ఎందఱి వేఁడుకొంటి? మఱి యెందఱిపాదము లంటుకొంటి? ముం
దెందఱి నాశ్రయించితి? నిఁ కెందఱికిన్ బ్రణమిల్లఁ జేసెదో?
కొందలమందెదం దలఁచి; గొబ్బున నా మన వాలకించి, యా
బందెలమారి చంద్రిపయి భ్రాంతి వహింపఁగఁబోకు డెందమా! 130

తే. ఎందఱు వెలందులను జూపి తింతదనుక?
అందఱను గాంచియు శమింప వకట! యిపుడు
చంద్రి పొం దేమి చందమా? సైఁచుమా య
ణంగుమా డెందమా! యిఁకఁ బొంగు మాని. 131

సీ. కొంకేది బానిసగుడిసెలు దూఱుట పరికించి చూడ నీకొఱకుఁ గాదె?
బత్తిని దొమ్మరితొత్తుల నిల్పుట గొనకొనియున్న నీకొఱకుఁ గాదె?
మొండిగోడలుదూఁకి బండదెబ్బలు తింట కొంచకెంచంగ నీకొఱకుఁ గాదె?
బాలవిధవలకు నోలి మాన్యము లిచ్చు టరసి చూడంగ నీకొఱకుఁ గాదె?
వారకన్యకలకు నే నవారితముగఁ
గోకలును రూక లిడుట నీకొఱకుఁ గాదె?
కూళతన మూను టెల్ల నీకొఱకుఁ గాదె?
హృదయమా! శాంతిము వహింపు మింకనైన. 132

ఉ. మానని కల్లుకంపు మెయి మానగు జొల్లు స్రవించి, కిన్కచే
మానసుఁ గొన్న దాని పెడమట్లు ముఖంబునఁ దాండవింపఁగా,
గానుఁగఱోటివంటి మెయి గంపిల దగ్గఱి, వామహస్తమా!
దాని పలుంగుమోవి పెడదాఁకుల వ్రక్కలుసేయు టెన్నఁడో? 133

ఉ. అల్లన వంగినం దలకు నంటెడి వాకిలి గల్గి, ధ్వాంత మ
ట్లల్లికగొన్న బూఁజు మెయి నద్రిగుహోపమ మై చెలంగుచుం,
బెల్లుగఁ గొఱ్ఱగంజి పడి మెట్టినఁ దీఁగలు సాఁగు చంద్రివం
టి ల్లెపు డీవు చొచ్చెదవొ హెచ్చరికన్? బహుదీర్ఘదేహమా! 134

శా. ఆ భూతాకృతి చంద్రి సాంద్రతరరోమాంచత్కపోలంబులన్
సాభోగస్ఫుటచండతాండవమహావ్యాపారకేళీకళా
లాభం బందెద మంచు నిక్కి నను నేలా పారఁగాదింత్రు? వ్య
ర్థాభీష్టం బది, నమ్ముఁడీ కరములారా! మిమ్ముఁ బ్రార్థించెదన్. 135

క. పలుతులువల బలుతాఁపుల
కలవడిన బజాటి వెఱచునా నీ గిలిగిం
తలకుఁ? దలంకుము, దానిం
దలఁచి నిగుడఁబోకు బాహుదండమ! యింకన్. 136

చ. వినువిను, మానుమాను, మవివేకము పూనకు, చంద్రిఁ బట్టఁగాఁ
జనకుము; చెప్పినన్ వినక సాఁగుచుఁ ద్రుళ్ళెద వేల? ముట్టినం
తనె యది బాళిమైఁ గొఱికినన్ సహియించెదె? మిన్నకుండు మి
మ్మనక ప్రియోగ్రయూకహననాదరశస్తమ! వామహస్తమా! 137

వ. ఇట్లనేకప్రకారంబుల మనోవికారంబుచేతం జేతనాచేతనజ్ఞానవిహీనుం డై యాసింహేంద్రరాజన్యశతమన్యుం డుద్దండంబుగ దండనుండి గండుకొని వచ్చు విషమాయుధవిధువాతపోతమధువ్రతపరభృతకీరవారంబుల గుఱించి యిట్లు దూషింపందొడంగె. 138

క. మదనా! మదనాశుగచయ
మదనా? చెలరేఁగి యేయ నాతతశశభృ
ద్వదనారమణీయవపు
స్సదనా! యెద నాఁట నిపుడు శంబరమథనా! 139

తే. సకలపూరుషహృదయార్తి సంఘటించు
సాని నీ చంద్రరేఖాభిధాన మూని
కేఱుచున్నది; దానిపైఁ గినుక మాని
తద్విరహి నన్ను నేఁచంగఁదగునె? చంద్ర! 140

క. ఫణిరోమరేఖ యగు న
గ్గణికాంగనమీఁదఁ బోవఁగా నెఱిచి, సమీ
రణామా! నను నేఁపఁగఁ గా
రణ మేమి? తలంగు సత్వరత సద్బుద్ధిన్. 141

ఉ. మి మ్మపకీర్తి ముంచఁగల మేలి నను న్వెలి గొప్పచేతనే
మమ్ము మనోభవప్రకటమార్గణమార్గముపాలు చేసి తాఁ
గి మ్మన కేఁగె; దానివరిఁ గేరరు, చంపకగంధి యంచునో?
తుమ్మెదలార! మీ రిచటఁ ద్రుళ్లెద రక్కట! శౌర్యహీను లై. 142

క. ఆ వెలపాలంతిఁ గని నేఁ
గేవలవిరహార్తిచేతఁ గ్రాశియించెడివో
నీవు చెవుల్ చిందఱగొనఁ
గోవెల! కూయకుము నన్నుఁ గొఱితన్ వేయన్. 143

క. పగఫురుషార్థం బంతయు
హరియించుచుఁ గేరు చంద్రి యంచితబింబా
గర మాని సుఖింపక, త
త్పరవశు నను నేఁచ నేమి ఫల మగుఁ? జిలుకా! 144

చ. అని యనివార్యమాణమదనాపదచే సకలప్రపంచమున్
దనువును జేనునున్ మఱచి, తన్మహనీయవియోగవార్ధిలో
మునుఁగుచుఁ దేలుచున్, బరమమూర్ఖతచేఁ బలవించుకొంచు, న
జ్జనవరపుంగవుండు కడు సత్త్వము పెంపు దొఱంగి మూర్ఛిలెన్. 145

తే. అనుచు శ్రీ నంబి నారసింహార్యవర్యుఁ
డాన తిచ్చిన, శివభూసురాగ్రగణ్యుఁ
డైన వీరన్న విని యద్భుతాత్ముఁ డగుచుఁ
బిదప కథఁ జెప్పఁ బతులితప్రీతి ననుడు. 146

క. మారాకారా! కారా
గారాంతరవిహారణోగ్రకర్మఠ! పారా
వారావృతధరణీతల
వారవధూజాలనిత్యవర్ణితశీలా!

మా. హరిగుణగణఖేలా! యంగజవ్యాధిలోలా!
పరిచితవిటజాలా! బాలరండానుకూలా!
నిరతరచితజాలా! నీచదాసేయపాలా!
దురితచయవిశాలా! దుర్గుణౌఘాలవాలా! 148

గ. ఇది శ్రీమజ్జగన్నాథదేవకరుణాకటాక్షవీక్షణానుక్షణసంలబ్ధసరసకవితావిచిత్రసలలితాపస్తంబసూత్రకౌండిన్యసగోత్రసూచిమంచికులపవిత్రగంగనామాత్యపుత్త్రమానితానూనాసమాననానావిధరంగత్త్రిలింగ దేశభాషా విశేషభూషితాశేషకవితావిలాస భాసురాఖర్వసర్వలక్షణసారసంగ్రహోద్దామశుద్ధాంధ్రరామాయణప్రముఖబహుళప్రబంధనిబంధనబంధురవిధాననిపుణశబ్దశాసనబిరుదాభిరామతిమ్మకవిసార్వభౌమసహోదరగురుయశోమేదురవివిధవిద్వజ్జనవిధేయజగన్నాథనామధేయప్రణీతంబైన చంద్రరేఖావిలాపంబను హాస్యరసప్రబంధరాజంబున ద్వితీయాశ్వాసము.




శ్రీరస్తు

# చంద్రరేఖావిలాపము

## తృతీయాశ్వాసము

క. శ్రీలలితవివిధదేశకు
శీలవగణానింద్యమాన చిరజీవిమహా
కాలబిడాలకరాళకు
శీలాపయశోవిశాల! సింగనృపాలా! 1

వ. ఆకర్ణింపుము తావకీనకథావిధానంబు; యథార్థంబుగాఁ దొల్లి శ్రీశివ బ్రాహ్మణవర్ణాగ్రగణ్యుం డైన వీరభద్రభట్టారకేంద్రునకు శ్రీమద్వైఖా నసవంశోత్తంసం బగు నరసింహాచార్యవర్యుం డవ్వలికథ యిట్లని చెప్పం దొడంగె. 2

క. అంతటఁ బటుఘటితగృహా
భ్యంతరమహిళాప్రగతిసుబంధురబలవ
ద్దంతయుతశయ్య నమ్మహి
కాంతుఁడు లేకున్న దాసికలు డాసి వెసన్. 3

క. కళవళ మందుచు, మన మిటఁ
గొలకొల మనుకొంచుఁ జుట్టుకొని యుండఁగఁ గో
మలగతి నేడకుఁ జనెనో?
తెలియ దహా! దైవమాయ తీ రెట్లగునో? 4

సీ. పిక్క లూరులు కాళ్లు పిల్లసేవకులచే గ్రుద్దించుకొనుచుండెఁ గొంతసేపు;
పాటకు ల్పఱతేరఁ బాడించుకొంచును గొల్వుదీరిచియుండెఁ గొంతసేపు;
హితవు మీఱఁగ భాగవతుల మేళ్వాసాల వింత గన్గొనుచుండెఁ గొంతసేపు;
మద్దెలమ్రోయంగ మధ్యమార్ణకయాడు నింతిఁ జూచుచునుండెఁ గొంతసేపు;

మంచ మెక్కి యొక్కతెతోడ మంతనమునఁ
బంతములు వల్కుచుండెను గొంతసేపు;
తమలము మెసంగి పొగచుట్ట త్రాగెఁ గొంత
సే; పతం డంత నెం దేఁగెఁ? జెప్పరమ్మ. 5

క. ఏ లంజెయింటి కేఁగెనొ?
యే శీలావతిని బలిమి నెలయించెనొ? తా
నేలాగు మాయమయ్యెను?
స్త్రీలోలుఁడు ధూర్తగుణుఁడు సింగం డహహా! 6

క. సంకరమునీషియజ్ఞము
పొంకము చూడంగ లేచి పోయెనొ? లే దా
వంకఁ బు లెత్తుకపోయెనొ?
జంకయ్యేడిఁ జెప్పరమ్మ జవ్వనులారా! 7

సీ. ఇందుఁ దా వెల్వడి యెందు వేంచేసెనో మాసామిఁ జూపరే మాలలార!
సన్నకసన్న నే సఖితోడ నుండెనో మారాజుఁ జూపరే జారులార!
వేఁపులఁ బట్టుక వేఁటకుఁ బోయెనో మాఱేనిఁ జూపరే మ్రాఁకులార!
ఇంపఱ బ్రమయించి యేటికిఁ బోయెనో మాదొరఁ జూపరే మడుఁగులార!
మమ్ము నేలిన సింహేంద్రమనుజవిభుఁడు
పూలపాన్పునఁ బెనునిద్ర పోయిపోయి
లేచి యెక్కరుఁడును మా కగోచరముగ
నెచ్చట నడంగెఁ జెప్పరే పచ్చులార! 8

క. ఎల్లీ! మల్లీ! పల్లీ!
పుల్లీ! మా రాజు కూసుపోవక యటు మీ
గొల్లెనకై రాఁడు గదా?
కల్లలు వల దింకఁ జెప్పఁగదరే వేగన్. 9

ఆ. నీలివార్త గాదు సుండు, నేస్తులార! విక్రమా
ఖీలశూరులార! పిన్నపెద్దలార! గుప్పునన్
బూలపాన్పు డిగ్గి యేడఁ బోయినాఁడో చూడరే
నేల ఱేఁడు సింగరాజు నిన్నరేయి యెక్కఁడున్. 10

వ. అని గగ్గోలుగ వారు రోదనము సేయన్, నాయకుల్ గాయకుల్
చనవర్లున్ గణికాజనంబు లనుజుల్ సామంతులున్ మంత్రులున్
విని శోకాకులచిత్తులై కదిసి, తద్వృత్తాంత మాలించి, యా
యన నన్వేషము సేయఁబోయిరి సమీపారణ్యమధ్యంబునన్. 11

క. గట్టుల దరిఁ, బుట్టల కడఁ,
జెట్టుల చెంగటను, జెఱువు చెంతల, బలు పె
న్గట్టుల సందుల గొందులఁ,
బట్టుగఁ బ్రవహించు నేటి పల్లములందున్. 12

క. రోయుచు హే యని కూఁకలు
వేయుచు హా! సింగభూప! విస్మయముగ నీ
వేయెడ కేఁగితో? వెస రా
వే యనుచును మోఁదుకొనుచు విహ్వలు లగుచున్. 13

క. మూఁగి యరయంగ, నాతని
తోఁ గూడం జనిన వేఁట తోరపుఁగుక్కల్
సైగలు సేయుచుఁ జాగఁగ
నా గతి గని చనిరి వార లందఱు వెంటన్. 14

క. చని కనిరి చంద్రరేఖా
తనురూపవిలాసవహ్నిదగ్ధశరీరున్
ఘనచింతాభారున్ నూ
తనజనితదశావికారుఁ దన్నృపమారున్. 15

వ. ఇట్లు కనుంగొని సకలపరివారంబు లతనిం జుట్టుకొని యాక్రందనంబు
సేయుచు నాశ్చర్యధుర్యమానసంబులతో ని ట్లనిరి. 16

క. వాతము పట్టెనొ? వనిఁ బెను
భూతము గొట్టెనొ? మఱెట్టి పాడ గుట్టెనొ? హా
హా! తెలియ దేమి మాయయొ
యీతఁడు పడియున్న చంద మెంచి కనంగన్. 17

సీ. బహుళద్విజద్రవ్యభక్షణోద్భవమహాపాతకంబున నోరు పడియెనొక్కొ?
కవిమాన్యహరణదుష్కర్మప్రభూతాతికలుషంబునను జిహ్వ పలుకదొక్కొ?
పరసతీవ్రతభంగకరణప్రభవపంకగతి దుర్బలాంగంబు గదలదొక్కొ?
సుజనులఁ జెడఁజూచుచూడ్కిఁ జుట్టినకొలఁగడుఁగనుంగవమూఁతపడియెనొక్కొ!
నిరతి నిజదాసికాజననికరములను
బలిమిమైఁ బట్టుపగలింటఁ బట్టి మాన
భంగ మొనరించినట్టి పాపమున నొక్కొ?
నేలపై సింగఁ డి ట్లొంటిఁ గూలినాఁడు. 18

వ. అని మహాదుఃఖావేశంబున నందఱు ని ట్లనిరి. 19

సీ. కొలువుదీర్ప వదేమి గురుతరతరుసారభాసురలక్ష్మీవిలాసమునను?
కూర్చుండ వదియేమి ఘుమఘుమామోదగుంభితసుచందనకాష్ఠపీఠమునను?
తేఱిచూడ వదేమి దృఢతరలావణ్యాగణ్యపణ్యస్త్రీనికాయములను?
పలుకరింప వదేమి బహువేషభాషాతిబంధురాశ్రితబాలభాగవతుల?
అకట! సింహేంద్రభూప! భోగానురక్తి
మాని, యీ ఘోరకాంతారమహిని బండఁ
గారణం బేమి? యేరిపైఁ గాఁక పూని
తెగి యిటకు వచ్చి యిట్లు నిద్రించె దిపుడు? 20

క. కేళీభవనాంతరపరి
కీలితమల్లీలతాంతకేవలశయ్యా
లోలుఁడ వై యుండక యీ
నేలపయిం బండ నేల? నేఁడు నృపాలా! 21

సీ. వీరభద్రక్షమావిభుఁడు పిల్వఁగఁబంచె బాచిరాజకుమార! లేచిరమ్ము;
క్రొత్తపారావారు కొలువంగవచ్చిరి రాచయేనుఁగుగున్న! లేచిరమ్ము;
ఎఱుకువాఁ డిదె పందినేసి మాంసముదెచ్చి కాచుకయున్నాఁడు లేచిరమ్ము;
వేఁటకుక్కలఁ గాన్కవెట్టి పంపిరి దొరల్ చూచివత్తువుగాని లేచిరమ్ము;
దాసి యొక్కతె నీ మైత్రి కాస చెంది
వాఁచియున్నది యోదార్ప లేచి రమ్ము;
బలిత మగు నీదు చిడుముపొక్కులకు మందు
రాచికొన సింగనృప! వేగ లేచి రమ్ము. 22

వ. అని మఱియును. 23

క. కదలఁడు పలుకఁడు ధాతువు
పదకరముల నుండఁజూచి బ్రదుకునొ లేదో
బెదరక యీతని స్థితి యు
న్నది యున్నటు చెప్పుమయ్య నాగనవైద్యా! 24

తే. అనిన, నాతండు దగ్గఱ కరిగి ధాతు
గతి పరీక్షించి, యితనికిఁ గామరోగ
మంకురించిన, దిఁక మీరు జంకు మాని
సరగ శిశిరోపచారముల్ సలుప, లేచు. 25

క. అని చెప్పిన, వా రందఱు
జనితామోదంబుతోడఁ జల్లనిపను లే

పునఁ జేయఁగ సమకట్టిరి
మనుజాధిపుచెంతఁ జేరి మక్కువ మీఱన్.

క. పసపును నూనెయుఁ గరపద
బిసరుహముల రాచి, విసముఁ బిండి శిరమునం
దిసుమంత గొఱిగి వడి నిడి,
వెసఁ జెవి వెల్లుల్లి యూఁద వేగమె తెలిసెన్.

ఆ. తెలిసి యుస్సు రనుచు నలుదిక్కులను జూచి
సైగసేయ, వారు చల్లగంజి
వంటకంబుఁ బిసికి వడిఁ బోయ, మెల్లన
గుటుకుగుటుకు రనుచుఁ గ్రోలి సోలి.

క. తెప్పిఱి కూర్చుండి యతం
డప్పుడు తన చంద మెల్ల నాప్తులతోడన్
గుప్పున నేకాంతంబునఁ
జెప్పిన విని, లంజె యెంత చేసె నటంచున్.

క. అకటా! దానికతనఁ బా
యక సింగనృపాలమౌళి కంటిన రుజ, లిం
టికి నొంటికి హాని గదా?
ప్రకటంబుగఁ బురుగు లురలిపడి చచ్చుఁ గదా?

క. పట్టుఁడు కట్టుఁడు కొట్టుఁడు,
గట్టిగఁ దల బోడిచేసి గాడిదమీఁదన్
బెట్టిపుడ పుడమి వెడలం
గొట్టఁగవలె, నంచు వారు కోపము మీఱన్.

ఆ. దానిఁ బట్టఁబూను తజిబీజు గనుఁగొని,
సాని నిట్లు సేయఁజనదు, నాకుఁ

గర్మార్ద్రి మీఱ మీరు కస్తురిం జిటు తోడి
తెచ్చి కూర్పవలయు నిచ్చలముగ. 32

క. తల గొఱిగించినఁ గొఱఁతయె?
లలాటగతరోమరేఖ లక్షణములలో
పలఁ గడు మేఁ; లయ్యాది యా
లలనకె గా, కన్యకన్యలకుఁ గలదె యిలన్? 33

క. నమిత మయి లోమయుత మై
యమితకఠోరగుణయుక్త మై హారిదళవి
భ్రమ మై యల్పాకృతి మై
నమరెడు నుదు రిచ్చు భాగ్య మందురు శాస్త్రుల్. 34

ఆ. ఇన్ని లక్షణంబు లెన్న దాని లలాట
పాళి నుండు ననుచు హాళి నాదు
నంతరాత్మఁ దోఁచె; నయ్యాది సౌభాగ్య
వతియె సుమ్ము, పెక్కు వాక్కు లేల? 35

ఆ. దాని మేని తీరు, దాని కన్నుల చెన్ను,
దాని మోము గోము, దాని మోవి
కావి ఠీవి చెప్పఁగా మాకు శక్యమే?
రోమములు వడంకుఁ గామరాజ! 36

క. సిద్ధాంతివి, పండితుఁడవు,
సద్ధర్ముండవును, నాకు సఖుఁడ; వెపుడు నే
నుద్ధతి దానిం బడసెద?
శుద్ధగతిం జెప్పుమయ్య సోమయ మాకున్. 37

వ. అని పలుకునప్పుడు, పండితుండును నిష్ఠాగరిష్ఠుండును సుజ్ఞాననిపుణుండును
హితుండును బ్రాహ్మణాగ్రగణ్యుండును శాంతుండును సకలజనసమ్మతుం

డును జతురుండును వంశవతంసంబును నగు పాపన్న, యాపన్నం డై
యా పగిది వాపోవుచుఁ గన్నులు తేలవైచు చున్న సింగన్నమన్న తనిం
గనుంగొని, వినయవిస్రంభగాంభీర్యంబులు గుంభింప గంభీరభాషణంబుల
మెల్ల మెల్లన యి ట్లనియె. 38

క. పరనారీసోదరుఁడవు,
పరతత్త్వవిశారదుఁడవు, బహురాజసభాం
తరనుతకీర్తివి; వేశ్యా
తరుణీస్నేహంబు గోరఁదగునే నీకున్? 39

సీ. చెఱువు చేసితివిగా చెలఁగి కావలి యొద్ద సద్రాజు లెన్న సముద్రముగను;
వనము నిల్పితివిగా వర్ణింపరాకుండఁ గోర్కెమైఁ జీఁదఱకోటయొద్ద;
మాన్య మిచ్చితివిగా మహిషిమూలంబునఁ గంచి సోమయ్య కఖండభూమి;
నా కిచ్చితివిగదా నాలుగైదువరాలు పేశలగతిని వర్షాశనములు;
వివిధసంగ్రామజయరుద్రవీరభద్ర
రాజకరుణాకటాక్షనిర్వ్యాజలబ్ధ
సకలసామ్రాజ్యఖనివి; నీ వకట! యొక్క
పుష్పిబోగపులంజెకై పొగులఁ దగునె? 40

క. ఇల్లును నొల్లును గుల్లగుఁ,
బె ల్లడరెడు రాజ్యలక్ష్మి పెంపు హరించున్,
గుల్లాపు సానిదానిన్
మళ్లనితమిఁ గోరి నీవు మఱి స్నేహింపన్. 41

క. వద్దుసుమీ, యిది కూడని
పద్దుసుమీ, నాదు మాట పాలించితివా
ముద్దుసుమీ, యా సానిది
మొద్దుసుమీ, దానిమీఁద మోహం బేలా? 42

క. ఎ గ్గెంచి, కవులచేతన్
బగ్గము సిరి వోవఁ దిట్టువడితివి; చంద్రున్
దగ్గఱఁదీసిన, మొదలే
నెగ్గ వయో! సింగభూప! నృపసుమచాపా! 43

వ. అప్పా దప్పలుకులు విని కటకటంబడి కటంబు లదరఁ బండ్లు పెటపెటం
గొఱికి చటులక్రోధకుటిలారుణాలోచనుం డై తదీయప్రధానప్రధానుం
డగు కామయామాత్యుం డతని కి ట్లనియె. 44

క. ప్రభుచిత్త మెవ్విధంబునఁ
బ్రభవించునొ యట్లె నీవుఁ బలుకక వడి ని
ట్లు భయము మాని పలికెదవు
సభలో వారెల్లఁ గడు నసహ్యతపడఁగన్. 45

క. ఓంభూలు చేసికొంచును
జంభంబులు గొట్టుకొంచు జడమతి నశుభా
రంభము లరయుచుఁ దిరిగెడి
దంభపువిప్రునకు నీకుఁ దగ దిది చనుమా. 46

ఆ. పప్పుదప్పళంబు లొప్పఁ దప్పొప్పలు
సెప్పుకొంచుఁ దడక విప్పుకొంచుఁ
జదువుకొంచుఁ దిరుగు ఛాందసుల్ మీరలు
రాజకార్యములకు రాఁగఁదగునె? 47

క. శౌర్యం బేలా విధవకు?
వైశ్యునకున్ సమరవిజయవాంఛ లవేలా?
[illegible] యయి మతి గరంచెడి
విద్యారత్నంబు వేదవిప్రున కేలా? 48

వ. అనిన నమ్మంత్రిజనపుంగవున కాతం డి ట్లనియె. 49

క. నిష్ఠాహీనుండవు, ఘన
నిష్ఠురమాయాప్రలాపనిపుణుఁడ, వీవే
జ్యేష్ఠుఁడవు, నిను నియోగి
శ్రేష్ఠులలోపలను జేర్చి చెప్పఁగనేలా? 50

క. తిరుమణియుఁ దాళసిపేరులు
తిరువారాధనయుఁ బెద్ద తిరుగూడ వెసన్
ధరియించి ముష్టి కిప్పుడె
తెరలుము మంత్రాంగ ముడిగి దాసరి వగుచున్. 51

తే. బంధుఁడును బండితుఁడు నేలపాటి రామ
మంత్రివర్యుం; డతనిఁ దోలు మడతవెట్టి
కొట్టి సన్న్యాసిఁ జేసితి; విట్టివాఁడ
వితనిఁ గులశేఖరునిఁ జేయు టెంత నీకు! 52

సీ. ఇయ్యనీయవుగదా యెంతసత్కవి వచ్చి ప్రస్తుతించినఁ బూఁటబత్తె మైన;
ఉండనీయవుగదా చండపండితరాజమండలంబును సభామంటపమున;
నిల్వనీయవుగదా నిమిషమాత్రంబైన నాశీర్వదించు ధరామరులను;
చూడనీయవుగదా వేడుకతోఁ బాడు గానవిద్యాప్రౌఢగాయకులను;
కూసుమతమార్గరతుఁడ వై కులము విడిచి,
తిరుగు నీ విందుఁ జేరి మంత్రిత్వ మూని
త్రిప్ప, సింహేంద్రరా జిట్లు మొప్పె యయ్యొ;
కలుషనిస్తేజ! విషభూజ! కామరాజ! 53

శా. సామం బేమియు లేదు; సాంత్వనవచస్సందర్భమున్ నాస్తి; దు
ర్గ్రామణ్యం బధికంబు; కాముకతయున్ గాపట్యమున్ హెచ్చు; గాఁ,
గామామాత్యుఁడ వంచుఁ బల్కు నిను లోకం బెల్ల; నిక్కం బహో!
నీ మంత్రాంగముచేత నేఁడు చెడియెన్ సింహేంద్రరా జెంతయున్. 54

క. గణికశ్రేష్ఠుఁడ వయ్యా!
గణికాంగన పొందు రాజుగారికిఁ దగ దం
చణుమాత్రముఁ జెప్పవు; నీ
గుణము తెలిసివచ్చె, బుద్ధికుశలుఁడవు భళీ! 55

క. అని వా రిరువురు నిటువలె
ఘనఘనరవసదృశనాదగద్గదగళు లై
కినుక వివాదింపంగా
విని చీమలకొండ సింగవిభుఁ డి ట్లనియెన్. 56

క. మీ రేటికి వాదించెద?
రూరక యుండుండు; చెలిమి యొప్పారంగా
గౌరవమున నా మదిఁ గల
యారాటము దీర్ప బాఁపఁ డసమర్థుఁడు గా? 57

వ. అని కామరాజుం జూచి యేకాంతంబున ని ట్లనియె. 58

ఉ. కోకిలకీరశారికల కూఁకలకున్ గలహంసకేకినీ
ఫీకరనిర్ఝరార్భటికి బెగ్గిలితిన్; మఱి చెప్పనోప, నెం
దాఁక సహించువాఁడ? వెస దానిని దోకొని వచ్చి చూపుమా
నా కెదలోని మన్మథకనద్ఘనపావకతాప మాఱఁగన్. 59

తే. అరయ సామాన్య గా దది; యల్ల సంక
రాభిధానమహాయజ్వ యంశఁ బుట్టె,
సకలకళలందుఁ జాతుర్యసరణి గనియె;
పూని వర్ణింప దాని కే సాని సవతు? 60

క. కావున సంకరశర్మకు
నా వల పెఱుఁగంగఁ జెప్పినను, నాతఁడు తా

నావలె పని సమకూర్చును
వేవేగమె కామరాజ! విచ్చేయవయా. 61

వ. అని చెప్పి. 62

చ. పనిచిన, నాతఁ డేఁగి కనె భంజితనీలతరాజకాయసం
జనితకరోటికూటము వసాసమ్మృతప్లుతసత్పలాశమాం
సనికరవర్ధమానవిలసత్పటువహ్నిశిఖాప్రభాట సు
త్యనుపమమంత్రతంత్రకరయాజకఘోటము యజ్ఞవాటమున్. 63

క. కనుఁగొని తచ్ఛాలాంతర
మున దక్షుఁడుఁబోలె యజ్ఞముఁ గ్రమంబునఁ దా
నొనరించు సంకరమఖిన్
జనవునఁ గని రాజకార్యసంగతి దెలిపెన్. 64

క. తెలిపిన, మఖి యత్యంతము
బలుపు వొడముఁ, గామమంత్రిపుంగవ! వెసఁ దాఁ
దలఁచిన పని సమకూర్తును
జెలిమి వెలయ, నీ మఖంబు చెల్లినపిదపన్. 65

క. దాతయు దైవము నేతయు
నే తీరునఁ గన్న నతఁడె యెప్పుడుఁ; గానన్
నీ తోడు, కామరాజా!
యాతని పని సేయు టుచిత మగుఁ గద మాకున్. 66

క. అని రాజుగారి కంతయు
వినయంబునఁ దెలుపు మనుమ వేఁడిన, నతఁడున్
జని యట్ల చెప్ప, సింగా
వనివిభుఁడు గుడారమునను వసరుమునుండెన్. 67

వ. అనంతరంబున నా ద్రావిడబాడబాగ్రగణ్యుం డగు సంకరసోమపీథి నిరత పర్యుషితాన్నదానవిధానసంశ్రద్ధసుప్రసిద్ధవృద్ధభూమిసురవారానివారిత భూరితరదారుణభాషావిశేషమూషితంబును, ప్రచండతరచండాలసరోవరపరిసరపరికల్పితానల్పవిశాలశాలాతటచటులకుటిలాచ్ఛమత్స్యపుచ్ఛాచ్ఛాదితకృపీటసంపాద్యమానాహీనపురోడాశప్రముఖాయోగ్యవస్తుయాగభాగానురాగరహితవిహిత మహితబృందారకబృందంబును, యథావిధవన్నిర్ధారితదక్షిణాక్షీణపదార్థవంచనాగుణనిరస్తోత్సాహసాహసధావన్మహాసోమయాజివిరాజితంబును, జామాతృవెంకనాఖ్యమూర్ఖమహాకఠినవాక్యతర్జనభర్జనపలాయితసకలదేశసమాగతవివిధవిప్రప్రకరంబును, పరమపరిహాసకపరికల్పితస్వచ్ఛచ్ఛాగనాదామోదితవేదితలాంతరపరివర్తితధూర్తపండితపామరజనసమూహంబును, బ్రాహ్మణార్థసంపాదితబహుళసత్ఫలశాకపాకభక్ష్యభోజ్యదధిఘృతగుడాదికవస్తుస్తోమచౌర్యక్రియాకౌశలయాతాయాతతాయిశ్రేష్ఠకుమారపేరయశాస్త్రివిశ్రుతంబును, సంభావనాసంభ్రమాలోకనార్థసమాగతవితతవారాంగనాభుజంగపుంగవశృంగారకేళీగృహాయమానశాలాసమీపప్రదీప్తవిశాలకాయమాననికాయంబును, ధూర్తయాపతపదశృంఖలాయమానకటాక్షాక్షీణశిక్షావిలాసవిలసద్బాలవిధవావిరాజితాంతర్గేహంబును, విదార్యమాణపశువిసరకళేబరసంజనిత ఘనతరక్షతక్షతజప్రవాహబిందుసందోహగ్రసనవ్యసనసంభ్రమభ్రమదభ్రశుభ్రగృధ్రకాకఘూకకంకకాలేయకగవయగోమాయుప్రముఖవన్యఖగమృగజాలకోలాహలబధిరీకృతజనసమూహంబును, పరమనిర్భరనిర్భాగ్యదామోదరదురోదరమృగయావినోదామోదఖేలత్సింహేంద్రభూపాలబాలికదుష్కరకరాగ్రసమర్పితయాగఫలదానధారాపూరంబునుం గా, క్రతువు సమాప్తంబు గావించి, 'జన్నంబు బన్నంబు లేకుండం గడతేఱె; మదీయపుత్త్రికి లలాటవిలసత్సాంద్రతర రోమరేఖ యగు చంద్రరేఖకును, గోమలాలంకారభవ్య యగు నా కావ్యకన్యకకును నుత్తముం డగు సింగనభూమిపుండు వరుం డయ్యెడు సమయంబు

నయ్యె; మానుకీనభాగ్యమహిమంబు 'చెప్పం దరంబె?' యని సంతుష్టాంత
రంగుం డై చని చని. 68

సీ. పూతిగంధాధారపుంఖితడిండీరభరితమైరేయకుంభవ్రజంబు,
గ్రామసూకరమాంసఖండతోరణావారకంకవాయసగృధ్రసంకులంబు,
మేదురఖాదనామోదసంపాదితతామ్రచూడాసహ్యతటతలంబు,
ఉన్మత్తషిడ్గసంఘోచ్ఛిష్టసాంద్రోద్ధిమాత్రాగ్రగేహాళిచిత్రితంబు,
విటవిటీజనసంధానవిహితవచన
నిచయరచనానిపుణకుట్టనీసహాయ
కరణకారణకౌలేయకంబు; కొంకి
రాభిధానాతినీచవేశ్యాలయంబు. 69

క. ఇటునటుఁ గనుఁగొని లోనికి
లోటలోటఁ జని మంచ మెక్కి, లోలత నది త
త్తటమునఁ గూర్చుండిన, న
క్కుటిలాత్ముఁడు కౌఁగిలించుకొని యి ట్లనియెన్. 70

తే. ఎంత భాగ్యంబు చేసితి మిరుపురమును!
కాసు విడకుండ నేఁడు యోగంబు గలిగె,
చంద్రరేఖను సింహేంద్రజనవిభుండు
మోహితుం డయ్యె; భాగ్య మామోద మొదవె. 71

క. ఏలిక సింగఁడు మిక్కిలి
తాళిక కృశియించె విరహదహనముచే, నీ
వేళం జచ్చును; వేగం
బాలోలతఁ జంద్రి నంపు మాతని కడకున్. 72

తే. పూలమ్మ్రాఁకులు నీవు నీ పుత్త్రికయును,
చూచువల్ల యొఱింగి బొజుఁగుల వలపు

తల్లిగొలుపుచు బలువగ విత్త మెల్ల
లాగుదురు; ధాత్రి మీవంటి లంజె లేరి? 73

తే. నేఁడు! మన కల్లువాఁ డయ్యె సింగనృపతి;
తూఁతురును నీవు నేనును గొదవలేని
సిరులఁ బొదలెద మింక; నీ చిన్నదానిఁ
గడఁకఁ గైసేయు, మని చంద్రిఁ గాంచి పలికె. 74

తే. బాలరో! నీవు మిగుల సౌభాగ్యవతివి,
యొక బొజుఁగు వోవ మఱియొక్కఁ డుత్తముండు
దొరకె; సింహేంద్రరాజు సచ్చరితుఁ డిపుడు
నిన్నుఁ గోరి పిలువనంపె, నేఁడు నీవు. 75

క. ఏలాగున వలయించెదొ?
యేలాగున సింగవిభుని నెలయించెదొ? మ
స్త్రేలాగున రక్షించెదొ
బోలెఁడు సుడి గలుగు మోము పుణ్యముచేతన్? 76

వ. అనిన నది యిట్లనియె. 77

తే. సుద్దులను ముద్దులను వింత విద్దెములను
నొద్దుఁ గావించి వంచించి ముల్లె లాగి
కడకు జోగిని జేసి సింగనిఁ జెలంగి
తెత్తు మీ సన్నిధికి నా ప్రతిజ్ఞ వినుఁడు. 78

ఆ. దొడ్డ దొడ్డ తురక బిడ్డల నా చేతు
లందు నిఱికఁబట్టి, యవల శిరము
పట్టి యట్టె మొత్తి వెట్టివాండ్రను జేతు;
సింగనృపుఁడు నాకు లొంగకున్నె? 79

తే. అనిన, నీ వంత నేర్పరి వగుదు వమ్మ!
కొమ్మ ముస్తీబుగమ్మ, శీఘ్రమ్ముగాను
బొమ్మ యాతనిలెమిఁ దీర్పఁ గమ్మవిల్తు
చేతిబంగారుబొమ్మ! యో చిన్నిబొమ్మ! 80

క. నావుడుఁ జెందిరి యప్పుడు
భావం బలరార లేచి పరిపరిగతులన్
వేవేగఁ జేయఁదొడఁగెన్
సేవలక్ష్యంగార మొదలఁ గీలుకొనంగన్. 81

క. ఏతరి సింగని బాలిసు
బాతిన్ విలసిల్లు తనదు బక్కయురమునం
దాతతమలయాచలసం
జాతామలగంధపంకసార మలందెన్. 82

ఆ. గొజ్జిబొచ్చుకంటె నెజ్జునై చిజ్జు లో
కుజ్జువెంద్రుకలను గూడదువ్వి
తొజ్జుకొప్పు పెట్టి నజ్జుమీఁదను జాల
విజ్జుపిఁగుకొంచు బిజ్జుబిగియ. 83

క. హారి మొగముఁ దెగడు మొగమున
హారిదళమును దళముగాఁగ నలఁది మహాసిం
ధురతర నేత్రయుగంబునఁ
గర మరుదారంగ మందుకాటుక పెట్టెన్. 84

క. పత్తికి సింగారించిన
యిత్తడి సొమ్ములను బోలి యొసఁగఁగ మేనన్
బుత్తడి సొమ్ములు తన కా
పత్తారణకారణముగ బాగుగఁ దాల్చెన్. 85

క. మించు పయంటను బోదలు సు
మాంచద్ధారములు గానవయ్యె నరేంద్రున్
గాంచుటకు వెఱచి గుప్పునఁ
బ్రాంచద్వల్మీకగతము లగు ఫణుల గతిన్. 86

క. ఈ లీల నలంకృత యై
యా లోల వెలింగె నప్పు డాశ్చర్యముగా
నేలిక సిఁగనిఁ బట్టం
బో లోలత మెఱయు పెద్ద భూతము యనఁగన్. 87

ఉ. అప్పుడు సోమయాజులు తదాకృతిఁ గొంకెరిపానియుక్తుఁ డై
యెప్పులు మొప్ప కర్తిలి వెలిం గని, కూఁతుర! నీకుఁ దుల్య యీ
నొప్పులకుప్ప నిప్పుడమి నొక్కెడఁ జూడము; లోల వయ్యు, బా
గొప్పెడు బాలలీలఁ గడు నూనితి మేల్భళి! యంచు మెచ్చఁగన్. 88

క. ఏలిక సింగఁడు వార
స్త్రీలోలుం డయ్యె నింకఁ జెడి వైతరిణిన్
గూలు నిటు లనుచుఁ దెల్పెడి
పోలిక నంభోధిఁ గ్రుంకెఁ బ్రొద్దు రయమునన్. 89

క. అపకారి సింగభూపతి
యపయశ మల విస్ఫుపముల నలమె ననంగా
విపుల మగు కటికిచీఁకటి
విపులాస్థలి నంబరమున విప్పుగఁ గప్పెన్. 90

శా. అంతన్, దారలు దోఁచె నంబరమునం దా సింగభూపాధముం
డెంతేఁ జంద్రిని జేరఁ దత్తనువునం దింతైన సందీయ క
త్యంతంబున్ వ్రణజాల మిట్లు వొడమున్ దథ్యం బటంచున్ నభః
కాంతారత్నము దెల్పెనో యన మహాగాఢాతిశాతచ్ఛవిన్. 91

ఆ. తాను జంద్రరేఖ నా పెసంగుదు నంచు
సాని పుప్పితొత్తు లోన నుబ్బ;
దాని నేఁతు నంచుఁ బాఁ గోపమున వచ్చె
నో యనంగఁ జంద్రుఁ డుదితుఁ డయ్యె. 92

వ. అయ్యవసరంబున. 93

ఉ. సంకరయాజియున్ ముసలిసానియు నెంతయు హృష్టులై, కడున్
బొంకపు మాటలున్ వగలు బుద్ధులుఁ దద్దయుఁ జిప్పగొంచు లోఁ
గొంకక సింగభూవిభుని గొల్వెనలోనికిఁ దెచ్చి చందిరన్
గంకటి చెంగటన్ నిలుపఁ, గన్గొని యా నరపుండు వేడుకన్. 94

ఉ. దిగ్గున లేచి దండమిడి, ధీవర! యజ్ఞముఁ జేసినావు సున్
బగ్గగ; మేము మన్మథవిపద్దశనుండి తొలంగ నిప్పు డీ
సిగ్గరికన్నెఁ దార్చితివి; చెప్పఁగ శక్యమె నీ ప్రభావ? మీ
వగ్గివి గాక బాఁపఁడవె యారయ? సంకరసోమపీథినా! 95

ఆ. యెద్దుమానుసుఁడవు యేదాంతుగుఁడవు నో
మాదుగుఁడవు నీవు మాము నైతి;
మాకుఁ బున్నె మెలమిఁ జేకూరె నో! లోకు
రేఖ మీఱు చంద్రరేఖవలన. 96

క. నావుడు నతఁ డిట్లనియెను,
దేవా! తావకకటాక్షదృష్టివలన నే
కావించితిఁ గ్రతు; విప్రుఁ డిది
నీ వన్నియఁ జూచి వలచె నిన్ను నృపాలా! 97

సీ. కైశ్యంబు కందంబు, ఘనగోధిచంద్రమఃఖండంబు, భ్రూద్వంద్వకముధనుస్సు,
చక్షుస్సులు చకోరపక్షు, లోష్ఠంబు పీయూషసరస్సు, పయోధరములు

మాతంగకుంభముల్, మలినరోమాళి పిపీలికాశ్రేణి, గంభీరనాభి
విసునిధి, కటి మహావిపులవేది, పదంబు తామరసంబు, మధ్యంబు ఖంబు,
వేదమూర్తి యగు బ్రహ్మ యివ్విధి సృజింప,
సరగ నొప్పులకుప్ప యగు చంద్రరేఖ
నీకు దొరకెను, దొరకొని నిరతలీల
దక్కనేలుము సింహేంద్రధరణిపాల! 98

ఆ. దీని తల్లి యీమె నా నేస్తురాలు, మే
మిరువురము నీకు హితులు; మెట్లు
సాకెదవొ? యటంచుఁ జంద్రిహస్తము దెచ్చి
యతనిచేత నుంచి యప్పగించి. 99

క. ముప్పదియగు ఉండ్లది, ముం
దప్పుడు నొక్కరుని నెఱుఁగ; దేలాగున నీ
విప్పుడు దిద్దుకొనియెదో?
మొప్పెతనము మాన్పవలయు ముందు నృపాలా! 100

వ. అని మఱియును. 101

శా. కం పేపారెడు మంచిగంధమును బుక్కా క్రొత్తపన్నీరు క
ప్రంపువ్వక్కలు నాకులున్ దబుకుతోఁ బర్యంకమం దుంచి తా
దంపత్యో శ్చిరకాలభోగ్య మను వృత్తంబుల్ మహాపుష్పరం
బింపొంగన్ బఠియించి సంకరమనీషీంద్రుండు మోదంబునన్. 102

శా. తారామార్గముఁ జూచి మంగలముహూర్తం బిప్పు డేతెంచెఁ గా?
ఔరా రాజాగ్రణి! పుస్తె కట్టు మిఁక జాగూనంగ నేలా? ధ్రువం
తే రాజా వరుణో యటంచు నుడువన్, దేజంబు దీపింపఁ ద
న్నారీకంఠమునన్ ఘటించెను సువర్ణప్రస్ఫురత్సూత్రమున్. 103

క. తలఁ బ్రాలు పోయ నవి జల
జల జాల్కాని దాని కర్ణకపోలములన్
బొలిచెను సింగఁడు తనకున్
వలఁ జిక్కె నటంచుఁ జంద్రి నవ్వెనా యనఁగన్. 104

వ. అనంతరంబున సంకరశర్మ. 105

శ్లో. త్వన్మందిరే బహుళకాంచనసిద్ధి రస్తు
వంశాభివృద్ధి రధి కాస్తు శివాంపోఽస్తు
బాలార్కకోటిరుచి రస్తు మతేతరాస్య!
హే సింగపుణ్యాజనవర్య! హరప్రసాదాత్. 106

వ. అని యాశీర్వదించి యిట్లనియె. 107

ఆ. ఆకు పోఁక చెట్టి లోఁకువగాఁ బట్టి
మంచిమాట లాడి మరపవలయు;
డాకఁజేసి రేసి తాఁకంగఁ బోవద్దు,
చంద్రి నీకు దక్కె క్ష్మాతలేంద్ర! 108

వ. అప్పుడు కొంకిరిసాని యిట్లనియె. 109

క. బాలసుమీ, గోలసుమీ,
బేలసుమీ, గాఢగతులఁ బెంపేవఁ గదున్
సోలింపక తూలింపక
పాలింపుము, చంద్రి నీదు పాలయ్యె నిఁకన్. 110

క. హా సిందు విడెను, మిక్కిలి
గాసిన్ దగ్గఱకమున్న గా; మచ్చికగాఁ
జే సిందు సొమ్ము; పిఁపన్
నీ సేఁతల కెల్ల నోర్చు నెలఁత నృపాలా! 111

వ. అని చంద్రరేఖం జూచి యిట్లనియె. 112

క. సవ్వేఁడా? పబు వీతఁడు,
యెచ్చమునకు సచ్చమునకు యిచ్చలయిడిగా
యిచ్చును పచ్చలు, గొలువుము;
సచ్చుయిటుల సేరవోక సందరలేకా! 113

క. దేవేరిఁ గేరవవు స
ద్భావంబున నితఁడు చేతఁబట్టిన నీ; వో
ప్రావుంబోఁడిరో! విటసం
భావనపైఁ దలఁపు విడిచి బత్తిఁ గొలువుమా. 114

సీ. పాటపాడు మటన్నఁ బాడక యెలుఁగెత్తి పదరి రోదనము చేసెదవు సుమ్ము;
కాళ్లొత్తు మని వేఁడఁ గడువడి నొత్తక నీ వొత్తు మనుచుఁ బల్కెదవు సుమ్ము;
తముల మందిమ్మన్నఁ దమి నీక క్రమ్మఱ నా కిమ్మటంచుఁ బెనఁగెదు సుమ్ము;
నాట్యమాడుద మన్న నవ్వుచు జాయక యదనునఁ బాఱిపోయెదవు సుమ్ము;
కుఱకదుండి గాఁడు, దూదేకులియుఁ గాఁడు,
పసులవాఁడు గాఁడు, బంటు గాఁడు,
మానల నేలు సింగమనుజనాథుఁ; డితంకు
సెప్పినట్లు నీవు సేయు సెంద్రి! 115

వ. నావుసు నతం డిట్లనియె. 116

ఉ. పుస్తడికీలుబొమ్మ యనఁ బోలెడు బోలెఁడుమేని చెందిరన్
హత్తుగఁ దోడితెచ్చి విరహార్తి హరింపఁగఁజేసినా వహో!
యుత్తమభూషణాంబరసముత్కర మిచ్చెద వేగ నందు; మో
యత్త! వలగ్ననిర్జితవియత్తల! కొంకిరిసాని! జానకన్. 117

క. అన వారలు నవ్వటయును,
జన వొప్పఁగ సింగవిభుఁడు చంద్రిన్ గని నా

తనవనిత గోష్ఠి చేకుఱె
నని లోపల మోహ మొదవి హస్తము పట్టన్. 118

క. తల వంచి గుడారంబునఁ
గల కంబము పట్టి వదలఁగా నొల్లక తా
వెలవెలఁ బోవుచు సిగ్గుం
గల బాలికవోలెఁ బెనఁగఁగా నాతండున్. 119

ఉ. హొంగుచు జుట్టు పట్టుకొని మొట్టుచు నల్లన డాయనీడ్చి, వా
రాంగన వింత సిగ్గువడ నర్హమె? యెందఱ దిద్ది తీర్చితో?
దొంగతనంపుటీవగలు ద్రోచి హసన్ముఖి వై కరంబులన్
లోంగఁగఁబట్టి నన్ను సుఖలోలునిఁ జేయుము నీకు మ్రొక్కెదన్. 120

ఉ. చంద్రుఁడు మింట నంటి సరసంబుగ నగ్నికరాళవిస్ఫుర
చ్చంద్రికఁ గాయఁజొచ్చె; సుమచాపుఁడు బాణము లేయఁజొచ్చె; నో
చంద్రి! విలాసవిభ్రమవిశాలకళారసలీల మీఱఁగా
సాంద్రకృపాకటాక్ష వయి చయ్యనఁ గేల్గొని నాట్యమాడుమా. 121

సీ. సకలభాగ్యము లిత్తు స్ఫటికంపుడాల్మోవిచవులు చూపియ్యవే చంద్రరేఖ!
శంబరాంతకుచేతి శరముల కోర్వను జక్కఁ గౌఁగిట డాఁచు చంద్రరేఖ!
తాళఁజాలను నీదుకాలికి మ్రొక్కెద సరసకు రాఁగదే చంద్రరేఖ!
చలి మేల పూనెదు? వలపు నిల్పఁగఁజాలఁ జచ్చిపోయెదసుమ్ము చంద్రరేఖ!
కసరుఁ బోవక నెమ్మోము ముడుఁచుకొనక
సిగ్గు విడనాడి ననుఁ గటాక్షించి నీదు
క్రొత్త నాట్యంపు సౌఖ్యంబు గూర్పు, మింక
జాగు సేయకు కటకటా! చంద్రరేఖ! 122

క. నీకున్ దాస్యము చేసెద;
నాకున్ గల ధన మొసంగి నానాగతులన్

సోఁకెద; నిఁక న న్నేలుము
ప్రాకటముగఁ జంద్రసాని! పల్లవపాణీ! 123

ఉ. సిగ విడి జాఱ, మేనిపయిఁ జెమ్మటబిందువు లూరఁ, జన్ని క
న్మోగడలు జొత్తుపాఱఁ, దెగి ముత్తెపుఁబేరులు నేలఁ జేర, నె
మ్మొగ మతిసార మూర, వెలిపుట్టము బూడిదరంగు దేర, నే
ర్పుగపడ దయ్యమట్లు సివమాడుము చూచి సుఖింతు మింతిరో! 124

క. నా విని యది కడుఁ గడఁకన్
మోవి విఱుచుకొనుచు మిగుల నోరు చెవుర్పం
గా వాలు బెళుకుఁ జూపులఁ
దా వలనుగ నతని మోము తప్పక చూచెన్. 125

క. ఇటువలెఁ జూచిన నాతఁడు
తటుకున నిదె సమయ మనుచుఁ దమి దీరఁగఁ జెం
గటి కరిగి మోవి మధు వటు
గుటుకు గుటుకు రనుచుఁ గడుపు కొలఁదిన్ గ్రోలెన్. 126

సీ. బుడ్డికుండలవంటి బుగ్గలు వీక్షించి, గొఱ్ఱెబొచ్చును గేరు కురులు గాంచి,
కప్పచిప్పలవంటి కనులు విలోకించి, నగరాజనిభ మైన నడుము గాంచి,
కర్కశశుష్కవక్షస్సీమ తిలకించి, బలుతెడ్లవంటి చేతులను గాంచి,
కొంగకంఠమువంటి కుతుక నాలోకించి, పులిబోనువంటి వళులను గాంచి,
తనదు చూపులు దేహ మంతటను బర్వ,
మిగుల నోరూర గ్రుక్కిళ్లు మ్రింగికొనుచు,
వెనుకకును ముంగలికి నూఁగుకొనుచు, సింగ
మనుజనాథుండు దానిఁ గన్గొనిన, నదియు. 127

క. మును నల్లనుండు మాజుము
తినియున్నది గాన మేను తిమ్మిరిగొని యా

తని చూపులకుఁ జలింపక
తన నేరుపుకొప్పుఁ జూపఁదలఁచి కడంకన్. 128

క. మొగము వికసింపఁజేయుచు
బిగఁబట్టుచు సుత్తికే నభేద్యముగ, నృపున్
వగఁ ద్రోయుచు బెణఁకించుచు,
బిగి చేతులఁ బట్టి యాడి బిట్టలరించెన్. 129

సీ. పారదాభకఘోష్ట్రిధారార్ద్రగండంబు, చండముండాఖండతాండవంబు,
బాహుమూలైకనిర్ఝరఘర్మసలిలంబు, చక్రక్రమచపేటచాలనంబు,
ఘూరిసురోద్గారిదారుణోచ్ఛ్వాసంబు, ఘనతనుదుర్గంధగంధిలంబు,
వికృతాంఘ్రితాడనవినతవలగ్నంబు, పీడాశ్రుపుంఖితాక్షీడితంబు,
గాద్గదస్వానిస్సరద్ద్రావ్యవచన,
మమితలాక్షారసాభక్షతాంగకంబు,
చంద్రరేఖాభిధానవేశ్యానలాస్య
ప్రథమలాస్యంబు సింగభూపతిఁ గరంచె. 130

వ. ఇవ్విధంబున భూతకిబొమ్మయుం బోలె నాట్యంబాడి యప్పుడప్పుడుపుం బోటిమిన్న మున్నెరిక నా సింగనపుంగవుని కుత్తుకకుం దన బాహా పాశంబులు తగిలించి హూంకరించి జంకించుకయు లేక సంకోచంబు మాని, 'ఇంక నా చేతం జిక్కితి; వెక్కడికిఁ బోయెదవు? నిలు నిలు, నా చమత్కారంబు తోరంబుగాఁ జూపితిఁ బరాకు గాకు; రా కొమారా! మా జాడక నా కేమి మెప్పు లిప్పు డిచ్చెదవో మది నెంచుకొమ్ము.' అని మురియుచు నూఁగులాడుమండం, గొంకిరిసాని ప్రారబ్ధయావనయుం బోలె నవనవోత్సాహం బంకురింప సంకరసోమయాజిని దొరంకించుకొని పదంబులు గుడించి వదలని మదంబును ముదంబును బొదల ముమ్మారమ్మున దొమ్మికొమ్మ విధమ్మున దుముకుచుఁ, దత్తఱింపక దిట్టంబు తెచ్చుకొని ముచ్చ

కొల్లం దీఱ గట్టిగ బిగఁబట్టి యిట్టట్టు చెదరకక తట్టువడక గుట్టు చెడక చేతుల పట్టు విడక చేయి మార్పు మాని యడుగు తప్పె నని మించఁబలు కుచు నడుము విఱుగఁదన్నుచు గిల్లుమఁ గోడెపాయంపు నాడెంపు సాలెవాఁడు ఘుమఘుమయని మనఁ బలక చులుకఁగ దాటించు వాటంబున నోటువడక యతని నటునిటు నాడించి నీటు చూపుచుఁ, బరిభ్రమణ వేగంబునం గనత్పాదభూషణవిశేషంబులు ఘల్లుఘల్లు మని భీషణంబుగ ఘోషింపఁ, గుండలంబులు గండస్థలం బాండవింపఁ, గోరిందకంప సొంపుసం బెంపారు కంపుమేనుల ననూనంబుగాఁ గ్రమ్ము ముమ్మరంపుఁ జెమ్మట సోనలు భూతలంబున జాఱి పంకంబు సేయ, వీరులసివం బెత్తిన లాగున నాట్యంబాడఁ దొడంగె; నంత సింగనన్నృపుండు సేదదేర్చుకొని, క్రమ్మఱ నటనమ్మున నుపక్రమించి, వనలని చలమ్ము హెచ్చఁ, బెచ్చుపెరుఁగు మచ్చరమ్మున బిరబిర సమీపించినఁ, జంద్రరేఖయును వదలక పసగుచు గుదిగొన్న తమకంబునం బలంకక తొరసిల్లుచును, నిద్దఱుం దద్దయు సంభ్రమంబును జలంబును జయకాంక్షయును మనంబునం బెనంగొన నగ్గలంబుగ నిగ్గుచు వెనుకకుం దగ్గుచు మొగ్గరించుచుఁ బగ్గలు సెప్పుకొనుచుఁ, జెంగులుం జాంగులుం జంచలింప గవాక్షక్రియ గిఱ్ఱుగిఱ్ఱునం దిరుగుచు, చెండుచెండుగ బండుబండుగఁ జప్పుడు లుప్పతిలఁ జిందులు త్రొక్కుచున్న సమయంబున, వృద్ధసంయతులు 'మోహం బంకురింపఁ జేసితి; మిం కిట నుండరా' దని నిష్క్రమించి; రయ్యవసరంబున నిర్గత్తుకజానుమానం బగు ప్రణయకోపంబు కారణంబుగా, వారిద్దరును గారొక్కన్న మహీపంబులు మంటనఁ, గుక్కురంబుల విధంబునఁ, జంబోతుల రీతి, మాలవాస పొట్టేలుం బలె, మార్జాలంబుల కైవడి, మదించిన కోడిపుంజాల మాడ్కి, గొఱ్ఱెపోతుల్ల బోలుగఁ దగవులాడి దొమ్మిపోరు నుగ్రమ్ముగఁ దన్నుకొని యలసి యొలుగుచు లేచుటకు లేఖుంగక దీర్ఘనిద్రాముద్రాసమాసక్తనేత్రులై పడి యుండి రనంతరంబున. 131

క. తమ్ములఁ జక్రమ్ముల నధి
కమ్ముగ బాధించు రాజు కాంతి దొరఁగి వే
గమ్మునఁ గ్రుంకెన్; దద్గతిఁ
గ్రమ్మర సింహేంద్రరాజు గ్రుంకక యున్నే? 132

క. అల సింహేంద్రమహీపుం
డెలమిని జంద్రికిని జిక్కి యెంతయుఁ దేజో
బలహీనుఁ డగుట నాస్యము
తెలుపు వొడమినట్లు తూర్పు తెలతెలవాఱెన్. 133

క. ఇనవంశసంభవుం డై
ఘనసన్మార్గంబు దొరఁగి కాముకుఁ డౌ సిం
గనృపతిఁ గా దనఁ గినుకన్
జనుదెంచె ననంగ నపుడు సవిత్రుఁడు దోఁచెన్. 134

తే. అంతఁ జీమలకొండ సింగనృపుండు
మొగము వెలవెలఁ బోవంగ నిగిడి లేచె;
చంద్రరేఖయు ముఖకాంతి సడలి కనులు
నుసులుకొంచును మేల్కాంచి మసలఁజొచ్చె. 135

వ. అత్తఱి నా రాజోత్తముండు దానిం గూర్చి యి ట్లనియె. 136

క. నావంటి రసికు డెందము
కేవలమును గరఁగఁజేసి కేరుచు, మిగులన్
భావజుఁడు మెచ్చ, దాసునిఁ
గావించితి; నీకు సాటి గా రే సానుల్. 137

క. నీ మొగము నీ విలాసము
నీ మెఱుఁగుం గన్నుదోయి నీ నాట్యంబున్

నీ మోవి నీ కచమ్మును
నా మది నిఁక మఱవఁజాల నమ్ముము బాలా! 138

క. సొమ్ములు చీరలును వరాల్
సమ్మతమున నీకు నిత్తు సత్యం; బిఁక నా
సొమ్మయి యుండుము విటసం
ఘమ్ములతోఁ జెలిమి మాని కలికీ! యెపుడున్. 139

ఆ. సానిదాన నంచు లోనలోనన వెచ్చ
కాంద్రఁ జేర దేమి? గాంచినపుడె
ముక్కు చెవులు మఱియు ముఖ్యంబుగాఁ జిత్తి
కొప్పు గోసి వెళ్లఁగొట్టువాఁడ. 140

క. మాయాపురమున నీ క
త్యాయత గేహంబు గట్టి యుం దుంచెద; నీ
వే యెడకుఁ బోక యుండుము,
నీ యండనె యుండువాఁడ నే నచ్చోటన్. 141

తే. నావుడు న దిట్టు లనియెను, దేవ! నాకు
నీవు దయ దంసఁ జిక్కుట కేవలముగ
సకలసామ్రాజ్య మిచ్చుటె; సంశయంబు
లేదు; నీదాన నై యుందు మోదమునను. 142

క. నీకంటె లోనిచుట్టము
నా కిచ్చెడువాఁడుఁ గలఁడె? నానాగతులన్
జేకొని కాపాడుము సుగు
ణాకర! యెవ్వరిని జేరనరుగక యుందున్. 143

వ. అంత నంతకము న్నె గోతియొద్ద నక్కచందంబున ద్వారబంధమ్ముకడఁ గాచుకయున్నవాఁడు గావున సంకరశర్మ యి దంతయు నాలకించి తటుక్కున లోనికిం బ్రవేశించి యి ట్లనియె. 144

క. ఇపు వినుము చంద్రరేఖా!
శ్వపకమువలె నిన్నుఁ జేతఁ బట్టి, యెవరినిన్
దృషఁ జేరనియ్య నమ్ముము,
మృష గా దని పలికె మిగులఁ బ్రేమ దలిర్పన్. 145

వ. అయ్యవసరంబున. 146

సీ. ప్రాఁతపుట్టము గట్టి, ప్రాఁతచెందిర వెట్టి, పాఁతచెప్పులు మెట్టి, చేత గట్టి
కోలసోలుచుఁ బూని, చాలమద్యంబాని ప్రేలుకొంచును, గూనుగ్రాల, మేని
పుండ్ల కీఁగలు వ్రాలఁ, బండ్లు బల్లునరాలఁ, గండ్లఁదస్సులు-చీల, రొండ్లు వ్రేల,
కోరు తేగుడు గాఱ, నారివేరము మీఱ, సారె పయ్యెద జాఱ యోరఁ జేర,
దారి వెమకుచు బడబడ దగ్గుకొనుచు
మొనసి కొంకిరిసాని సింగనన్నపాలు
గొల్లెనకుఁ జేరి తల యూఁచుకొనుచు లోని
కరిగి చే యెత్తి మ్రొక్కి యి ట్లనుచుఁ బలికె. 147

క. నీ బానిసతొ త్తిది; దయ
చే బాసల నిచ్చి చాలఁ జేపట్టు; మికన్
గాబాగూచీ సేయక
నీ బంతిని గూడు గుడుపు నిత్యము శేఁడా! 148

వ. అనిన నతం డత్యంతసంతోషస్వాంతుం డై యట్ల చేసెద నని దానికిం
బీతాంబరాదికంబు లొసంగి చంద్రియె లోకంబుగా మెలంగుచుండె. 149

సీ. అది భోజనముచేసి వదలినకూడు దాఁ గుడిచి కంచముతోమి కడిగితుడుచు;
అది తెములముసేయ నాకు ఘట్టియొసంగి తమ్మ గైకొని నోరఁ గ్రుమ్మి నమలు;
అది మదిర గొనంగ నది మంచిదే యని తచ్ఛేషపాత్ర మోహమునఁ ద్రాగు;
అది నిదురించుచోఁ బదములవరిఁ జేరి వద్దువద్దనుకొద్ది గ్రుద్ది పిసుకు;

కాలు చాఁచుక కూర్చుండి పేలు గ్రుక్కు;
వీఁపుపైఁ జెమటకాయలు వెతకి గోఁకు;
అలసి మంచంబు చేరి నల్లులను జంపు;
వలపు గులుకంగ సింహేంద్రమలహరుండు. 150

క. ఇ ల్లెఱుఁగక ప ట్టెఱుఁగక
యెల్లధనము దాని కిచ్చి యెగ్గను సిగ్గున్
బోల్లుగఁ దత్పాదద్వయ
పల్లవముల దండ మురిసి పడి కాపుండెన్. 151

తే. క్షోణిపైఁ గ్రుడ్డిలంజెకుఁ గుంటివేడ్క
కాఁడ నెడు మాట చంద్రరేఖకును సింగ
ధరణివరునకుఁ జెల్లెను దత్కథావి
ధంబు వినిపించితిని నీకుఁ దథ్యముగను. 152

తే. అనుచుఁ దంబళి వీరభద్రార్యమణికి
నంబి నరసింహుఁ డతులితానందహృదయ
కమలుఁ డై చెప్పి యంతట సముచితగతి
నతని వీడ్కొని చనె దేవతార్చనకును. 153

క. వాచాగోచరముగ భువి
నాచంద్రార్కంబు గాఁగ హాస్యరసముచే
నా చంద్రరేఖ కథయును
నీ చరితముఁ జెప్పి తిట్లు నృపకులచంద్రా! 154

క. ఈ కృతికి సమముగాఁ గృతి
నే కవులును జెప్పఁజాల, రిది బిరుదము; భూ
లోకములోపల నీకున్
జేకుఱె నిటు హాస్యలీల సింగన్నపాలా! 155

చ. ధరణియు మేఘమార్గమును దారలుఁ దామరసాప్తచంద్రది
క్కరటిగిరీంద్ర శేషఫణికంఠికిటీశ్వరకూర్మనాయకుల్
స్థిరముగ నెంతకాలము వసింతురు, తత్క్రియ నీ ప్రబంధ ము
ర్వర సరసోత్తముల్ కవులు వర్ణనసేయఁగ నుండుఁగావుతన్! 156

క. చేటీగణచరమవపుః
కోటీసంలబ్ధవిపులకోమలపంకో
త్పాటనకరఖరనఖర! ని
శాటోపమఘోరరూప! యార్యదురాపా! 157

స్ర. బాచిరాజోల్లసద్వంశ దావానలా!
యాచకాస్తోకమేఘౌఘఝంఝానిలా!
నీచవారాంగనానీకనిత్యాదరా!
పాచకాధార! నిర్భాగ్యదామోదరా! 158

గ. ఇది శ్రీమజ్జగన్నాథదేవకరుణాకటాక్ష వీక్షణానుక్షణసంలబ్ధ సరసకవితా విచిత్రసలలితాపస్తంబసూత్రకౌండిన్యసగోత్రకూచిమంచికులపవిత్రగంగనా మాత్యపుత్ర మానితామానాసమాన నానావిధరంగత్త్రిలింగదేశభాషావిశేష భూషితాశేష కవితావిలాసభాసురాఖర్వసర్వలక్షణ సారసంగ్రహోద్దామ శుద్ధాంధ్రరామాయణప్రముఖబహుళప్రబంధనిబంధనబంధురవిధాన నవీన శబ్దశాసనబిరుదాభిరామ తిమ్మకవిసార్వభౌమసహోదర గురుయశోమేదుర వివిధవిద్వజ్జనవిధేయజగన్నాథనామధేయ ప్రణీతం బైన చంద్రరేఖా విలాపం బను హాస్యరసప్రబంధరాజంబున సర్వంబును ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీరస్తు

# చంద్రరేఖావిలాపము

## ఉపసంహారము

సం. పాఠకోత్తములార! పరికింపరయ్యా,
స్వార్థభంగార్తి లేశంబును లేక
నిష్పక్షపాత మౌ నీతిని నిలుచు
పాపన్నవంటి సంపన్నగృహస్థుఁ
డరయ నూటి కొకండు దొరకునే మనకు?
అది సంశయాస్పద; మట్టివారల నె
జనులు వివేకులై వినుతింత్రుగాక!
యనుసరింతురుగాక! యద టుండనిండు.
చెడిన చీమలకొండ సింగవిభుండె
మంచివాఁ డనిపించు మార్గంబులందు
సిగ్గు నెగ్గును లేక చెలరేఁగి తిరిగి
పెద్దల మనుచు గర్వించి భూభార
మాత్రకారణ మైన మై యుజ్జగించు
ధనమదాంధులు లేరె ధారుణి నిపుడు?
సార్థకనాముఁ డౌ సంకరశర్మ
గురువులుం బోలె దుర్గుణవిశేషములు
గలిగి, బైటికి వృత్తికై నిష్ఠఁ బూని
[illegible] గుడిసెలు దూఱుచు, నొక్క
కాసున కెట్టి దుష్కార్యంబు నైన
నెఱపెడి ధూర్తపండితకోటి లేరె?

ప్రకటదుష్టునిఁ గామరాజును మించి
ప్రభుచిత్త మనియెడి వ్యాజంబు పూని
మంచిచెడ్డల సంచు నెంచ కించుకయును
నాత్మార్థమై యెట్టి యన్యాయ మైన
నాచరించి చెలంగు నీచదుర్మంత్రు
లెందఱోనియు లేరె యీధాత్రి నిపుడు?
ఈ కృతిచేఁ గాక, యిట్టి మూర్ఖులకుఁ
దగినట్లు బుద్ధి చెప్పఁగ వీలు గలదె?
పౌరుషశాలు లౌ పండితకవులు
కొనుగోలునకు దొరకుదురె యంగడుల?
వివరింప నింకొక విషయంబు గలదు,
చంద్రరేఖను దాని జననిఁ గనుండు
వారి వివాదంబు పరికింపనగును;
దేశపరాభవాధిక హేతు వైన
హేయవేశ్యావృత్తి యెగ్గించి చూప
నింతకన్నను మార్గ మెందేనిఁ గలదె?
ఆ యవమానంబు నడుగంటఁ జేయ
నరసెడి మన ప్రభుత్వాధికారులకు
నిదియుఁ దోడ్పడుఁ గాక యించుకంతేని!
ఈ రీతి దేశోపకృతులు ఘటింప
సమకట్టునట్టి శ్రీ జార్జి ప్రాభవము
సమకూరుఁగాక యాచంద్రార్కముగను!

కొల్లకూరి గోపాలరావు

British Model Press, Choolai, Madras—1920